# రంగవల్లి

(కథలు)

మల్లాది రామకృష్ణశాస్త్రి

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# విషయ సూచిక





# మనవి

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథలు ప్రచురిద్దామని నిర్ణయించుకొని వారిని అనుమతి యివ్వవలసినదిగా కోరాము. మేము కోరిన దే తడవుగ మాకు అనుమతి యిచ్చినందుకు వారికి సదా కృతజ్ఞులము. అనుమతించడమేగాక అక్కడక్కడ చెదిరివున్న కథల నన్నింటినీ సేకరించి నాలుగు సంపుటాలుగా మాకు అందజేసినందుకు మల్లాదివారికి మరొకసారి కృతజ్ఞత తెలుపుకొంటున్నాము.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారి కథలు నాలుగు భాగాలుగా ప్రకటిస్తున్నాము. ఇది రెండవభాగం. మిగతా రెండు భాగాలుకూడా త్వరలోనే అందజేయగలం.

పాఠకులు యీ కథలను ఆదరించి మా ప్రచురణాలయానికి చేయూతనిస్తారని ఆశిస్తున్నాము.

— ప్రచురణకర్తలు.



# రంగవల్లి

అది,- 'మనుచరిత్రం బందుకొనువేళ'- కొత్త ఒరుపుగా, పెండేరం ఒరుసుకుంటూన్నది- పెద్దన్నగారు, ఆ పాదం కనంత ముందుకు మోపి.- రాజును మించిన ఠీవితో గొంతు సారించాడు: రాయలవారు, పరధ్యానంగా, వింటూన్నట్టు చిరునవ్వుతో, యోధుడల్లే కూర్చున్నారు :-

మనుచరిత్ర రచన పూర్తిఅయేసరికి అందులో రవ్వల్లాంటి పద్యాలన్నీ, విద్యానగరంలో ప్రతిఇంటింటికీ, చూరు చూరుకూ, పెండె పెండెకూ పట్టిపోయినాయి. ఆ సంగతి యిచ్చిపుచ్చుకునేవారికీ, తతిమ్మా పెద్దలందరికీకూడా తెలుసు. కాని. యీ తతంగం ఉంటూ తలపెట్టి, ముహూర్తం పెట్టినప్పుడు - అదో ఉత్సవమంత హంగామాగా చేస్తున్నప్పుడు

మళ్ళీ ఒక్కొసారి, అక్కడా-అక్కడా నాలుగు పద్యాలు ఏరి, వినిపించడం- అదో లాంఛనం: ఆ మొక్కు తీరిపోగానే, ఆశ్వాసాలకు ముందూ వెనుకా పద్యాలు చదవడం రివాజు: ఆ పద్యాల పసలో ఉంది,- కృతి పుచ్చుకునేవాడు, ఎంత వరకూ మోజుపడతాడో,- ఎంతకు తూగుతాడా అనేది!-

ఒకటి తరువాత మరోపద్యం, వెనుకటిదాని తాత లాగా, సభలో ముసురుతాంది: రాయలవారు, ఇంద్రుడైనాడు, చంద్రుడైనాడు,- వాళ్లను పుట్టించిన వాడైనాడు- చతుర్దశ భువనాల్లో ఉన్న తురుష్కుల నందరినీ, ఒంటిచేతిమీద చీల్చి చెండాడాడు: అంతటితో శాంతించక బంగారం తాంబూలంలో పచ్చని అగ్రహారం పెట్టి, పెద్ద బ్రాహ్మడి నోటి మీదుగా ప్రబంధం అంకించుకుంటున్నాడు-

వందిమాగధులకు అది ఆట విడుపు. సభాస్తాయిలు మాత్రం తప్పనిసరిగా పద్యాలకు రాజోచిత మర్యాదగా, తల పంకించుతూ, కొలువు చేస్తున్నారు-

"చిన్నాదేవీ జీవితనాయక !-"

ముసలి సత్తువకొద్దీ, ఉన్నట్టుండి, కందపద్యం తునక బాకల్లే విసిరాడు: గురి బెడిసిపోకుండా రాయలవారి గుండెల్లో నాటింది - సభలోంచి దూసుకున్నారు -

'కవితా ప్రావీణ్య పణీశ, కృష్ణరాయ మహేశా!-'

రాజువెంట సభఅంతా తరలింది: నడుస్తూనే పెద్దన్న గారు పద్యం పూర్తిచేశారు: అప్పటి కప్పుడే, కృష్ణరాయ మహేశుడు, అరదంమీదికి దుమికి, మనోవేగం అయినాడు -

వాకిటి కావలి తిమ్మన్న ఒక్కడూ, జాలిగా ఆ వంకే చూస్తూ నిలుచున్నాడు : పెద్దన్నగారి అడుగు అక్కడ ఆగింది :

'ఏం తాతా ?' అని గొణుక్కున్నాడు తిమ్మన్న :

'ఏం అన్నా !' అని గదమాయించింది — గండ పెండేరం.

'కృష్ణశిమీద యిప్పటికైనా కరుణ కలిగిందేమో అనుకున్నాను !' అని నిట్టూర్చాడు తిమ్మన్న :

'తమ్ముడూ ! – కవికీ కత్తికీ కరుణ ఏమిటి ? – ఒక్కటే వాడి !–' అని పిడుగల్లే అన్నాడు పెద్దన్నగారు : గజపతుల ఆడుపడుచు అలా అయిపోవడానికి. కారణం ఏ రాజపరమేశ్వరుల ప్రతాపం ? – కన్నతల్లి మోహనాంగిని కత్తివాత చేసిన,– కన్నడ రాజ్యరమా రమణుడు – ఎలా మరచిపోతాను, – ఎందుకు కరుణిస్తాను తిమ్మన్నా ! – అంకితం పద్యాలకు అహోరాత్రాలు పదును పెట్టాను – ఆకల్పాంతం ఈతని యశఃకాయాన్ని చీల్చి చెండాడుతూండవస్తూ : మోహనాంగి, నా శిష్యురాలు తిమ్మన్నా ! – ఆ తల్లి ఆత్మశాంతికి, – ఇంత కాలం బ్రతికాను –' పెద్దన్నగారు శోకంతో, నేల దద్దరిల్లే అడుగులు వేస్తూ వెళ్ళిపోయినారు –

తిమ్మన్న అలాగే ద్వారానికి ఆనుకుని చతికిల పడిపోయి, – కళ్ళనీళ్ళతో, ఆనాటి కథంతా తలపోసుకున్నాడు – కన్నదీ, విన్నదీ !.........

౨

రాయలవారు కటకందాకా దిగ్విజయం చేసి, మగుడి నగరుకు వేంచేస్తున్నారని – రాజధానిలో చాటించారు : నగరానికి నలుమూలలా ఉన్న పూలన్నీ దులుపుకువచ్చి, పౌరులు మహారాజుమీద పుష్పవర్షం కురిపించేందుకు కావలసిన కట్టుబాట్లన్నీ మహామంత్రి చేశాడు : అందరికీ కనువిందుగా కన్నడ – రాజ్యరమా రమణుడు రాజమార్గమంతటా శీవి మెరయించి – అలసటగా అంతఃపురం ప్రవేశించాడు :

మహారాణి తిరుమలాంబికా, అమ్మాయి మోహనాంగి, ఎదురుగా వచ్చారు : అన్ని ఏళ్లనుంచి కాపురం జేస్తున్నా రాణి అప్పటికప్పుడు, అన్నాళ్ళకు కనబడ్డ నాథుణ్ణి ఓరగా చూస్తూ కొత్తపెళ్ళి కూతురంత సిగ్గుపడ్డది : మహారాజు, ఒక్క – కటాక్ష వీక్షణం అలవోకగా ప్రసరించారు :

'విజయలక్ష్మీ సమేతులు – మహారాజులు–' అని ప్రణామంచేసింది– మోహనాంగి : రాయలవారు రవంత ఉలికిపడి, తిమ్మరుసు అయ్యవారి వంకచూశారు :

'ప్రభువు మార్గాయాసం అపనయించుకోవలసి ఉంది–' అని మనవి చేసినట్టుగా పలికి,– ఇద్దరూ బయటికి తప్పుకున్నారు :

'అమ్మాయి శ్లేషించిందేమోనని, అనుమానం అప్పాజీ !' అన్నారు రాయలవారు: తిమ్మరుసు వెంట అడుగు వేస్తూ: 'అనుమానం కాదు. అదియూ ఢే ప్రభూ !'

'అతిరహస్యంగా కొనసాగించామే!- మనం గజపతుల కన్యను చెట్టబట్టినట్టు- అప్పుడే ఇక్కడికి ఎలా తెలిసింది?'

'రవి కంటబడనివి,- కవికి ఎలా తెలుస్తాయో అలాగే!- మీబిడ్డ ఆమాత్రం గ్రహించలేదా?-

'విజయలక్ష్మి అని పేరుకూడా ఎలా తెలిసింది?- అంతఃపురం మనమీద వేగు నడుపుతూందా?-'

'అది అసంభవం నాయనా! కాని, నీ దిగ్విజయ వార్త మరుక్షణంలో దిగ్దిగంతాలూ వ్యాపించడం పరిపాటి అయి పోయింది: ఇదీ అంతే!-'

'అంతేనని శోచను అప్పాజీ!- నాకు అవగతం కాని హాంశం ఏదో ఉంది: తనతల్లికి సవతిని తెచ్చానని.- మా తల్లికి ఆగ్రహం వచ్చిందేమో?'

'రాదు - ప్రభువు శోభన పరంపరా వార్తకి మురియని ప్రజలు- విద్యానగరంలో లేరని- నేను మనవి చేయవలసిన అగత్యం వస్తుందని అనుకోలేదు-'

'అదికాదు- అప్పాజీ!-'

'నీ మనసుకు సంకోచాన్నీ ఖేదాన్నీ కలిగించే విష యాన్ని యింకా తరచడం ఎందుకు నాయనా!- పడినశ్రమకు తగినఫలం దక్కింది- అదే, నీకూ నీ దేశానికి కావలసింది: యీ మూడు రాత్రులూ వసంతోద్యానం మీ విడిది-'— రాయలవారు,- ముసిముసిగా నవ్వారు :-

౩

విద్యానగరంలో విడిది విడిదికీ,– తెల్లవార్లూ, శోభ నక్షత్రకళ, పున్నమి వెన్నెలగా వెల్లివిరిసింది– రాయలవారు,– ఎక్కడో మారుమూల మాధవీమంటపంలో, అనుమనురు లతో, – ఆకాశంలో చుక్కలు కన్నులకు అందినన్ని లెక్క పెట్టి, – ఆదమరచి నిద్రపోయినారు :

నగరిలో, పెద్ద ముత్తైదువు తిరుమలాంబ,– నాథుడు సాక్షాత్ కృష్ణావతారమని నమ్మిన ఛాందసాన, పరిపాటి అయిన ఒంటరితనంతో,– నిదురవచ్చేదాకా, ప్రభువు దిగ్విజయవార్తలు చెలికత్తెలు. చిలవలు పలవలల్లి మనవి చేయగా, సెహబాస్ అని తల ఊచుతూనే ఊయెలమీద, కునుకు పట్టించుకుంది.

తొలికోడి కూసింది : రాయలవారు – ఉలికిపడి మేలు కున్నారు. నిదురమబ్బున అడుగు తడబడగా, – మాధవీ మంటపంలో అల్లిబిల్లిగా ఉన్న మల్లెతీగెలు, – రాయల వారిని, అలవోకగా గాఢాలింగనం చేసినవి: కలలంతటా అల్లుకు పోయిన – గజపతుల ఆడుపడుచు కౌగిలింతగా, రాయలవారు తబ్బిబ్బైపోయి, – నిదురమైకాన మనసును ఉగ్గబట్టి తీగెలను మెల్లిగా విడిపించుకుని,– నికరంగా,– ఇక మేలుకున్నారు.

కపర– కపరగా ఉంది, చీకటి; కన్ను చూచాయగా కనబడుతూంది: మాటుమణిగిన నగరం,– ఓ మూలనుంచి మేలుకొంటూంది :

ఎక్కడనుంచో మూలుగు వినబడుతూంది! ఎంత సెప్పగానో, ఆ సవ్వడి, మనసులో రాపాడుతూనే ఉంది, కాని,- బోధపడ రాలేదు!

అడుగులు, ఆగిపోయినవి! గున్నమావి తిన్నె మీద నుంచి, వస్తోంది ఆ మూలుగు –

—'అప్పాజీ !-'

రాయలవారి గొంతులో, భయం, ఆశ్చర్యం, విషాదం, విభ్రమం –

మహామంత్రి రెండుకళ్ళూ పొడిచేసి–, ఎవరో ఆ తిన్నె మీద పడేశారు! గాట్లల్లో చిమ్మిన నెత్తురు, పేరుకుపోయింది; మనిషి, ఒకటే మూలుగుతో, మాటల్లే ఒంటిమీద స్పృహ లేకుండా గుటగుట లాడుతున్నాడు – రాయలవారంత కరుకు యోధుడు– నిర్దాక్షిణ్యంగా అంతసీమను జయించుకువచ్చిన జగజెట్టి – చూసి చూడగానే, పసిపాపడల్లే అడలుతూ, నిలువునా కుప్పకూలి పోయినాడు!

ఒర దూసుకున్న కత్తిలాగా, మనసు, రాత్రి ఏం జరిగి ఉంటుందో ఒక్కసారి ఝళిపించింది–

గజపతుల కన్నె,– ఆమె వెంటవచ్చిన దాసీ రాక్షసులు,– మహామంత్రి,– మంచితనానికి చేసిన తంత్రం– పసిపట్టి ఉంటారు! అలా కసితీర్చుకుని ఉంటారు!

తనకైతే, చేతనైనంతవరకూ, రాజ్యాలు జయించడం, పరరాజుల ధాకను అరికట్టడం, ఇలాటి, వీరరాహుత మర్యా

వలే తప్ప, మరో పోణిమి, మొదట నుంచీ అబ్బలేదు: మనసు తోనే వ్యూహాలు పన్ని, ఊహాలతోనే ఆటకట్టించే ఎత్తు మమికించడం, మహామంత్రుల ప్రజ్ఞ: అదితనకు అర్థంకాదు, చేతకాదు :

మొదటినుంచి కూడా,- గజపతులతో వియ్యం తనకు యిష్టంలేదు; ఆ చిన్నది, తన కుమార్తె ఈడుది: ఎంతజయిం చినా మటుకు, ఏ మొగం పెట్టుకొని తనంత పలకమారిన సంసారి, తగుదునమ్మా అంటూ, పెళ్ళికొడు కౌతాడు? - ఆ చిన్నది ఏమనుకుంటుంది? కన్నవారూ, విన్నవారూఏమను కుంటారు?-

మహామంత్రి దీనికంతటికీ ఒక్క-టే సమాధానం యిచ్చారు: అంతా విని, ఒక్క- చిరునవ్వు నవ్వి,- 'నీకు తెలి యదు నాయనా !- రాజతంత్రంలో,- కయ్యానికేగాదు, వియ్యానికీ అంతకు మించిన ప్రాముఖ్యం ఉంది ! మన సీమలో ఉండి, ఆసీమ ఏలికలను, అనుక్షణం అదుపులో ఉంచనౌనా?- కత్తిపదునుకు చేరువగా వాళ్లకన్నెలను తెచ్చుకుంటే-, ఏనాటికీ మనకు వాళ్లు పాదాక్రాంతులేగా ! - కత్తికి ఒక్క-టే పదును, - రాజనీతికి - వేయిపదును లున్నాయి ! - నేను చెప్పినట్టుగా చెయ్యి ! - ' ఇంతా అర్థంఅయ్యేట్టు, రెండు ముక్క-లలో చెప్పారు ! తాను, సరేనని, తలవంచుకున్నారు!

కత్తికి బాసికంకట్టి తరలించారు ! - గజపతులు, కన్నె ధారపోశారు : పెళ్ళివారు విద్యానగరానికి తిరిగివచ్చారు.

కొత్త పెళ్ళికూతురికి, ఆమె పరిచారికా గణానికి, అప్పాజీ అతిరహస్యంగా విడిది ఏర్పాటు చేశాడు. అతి వైభవంగా పునస్సంధానానికి సన్నాహం చేశాడు-

అంతవరకూ రాయలవారు, వధువును కళ్ళచూడ లేదు: ఎవరూ, ఆమె అందచందాలను వర్ణించి, నోరూ రించలేదు: ఆయనకు ఆ విషయంలో అట్టే ధ్యాసకూడా లేదు: అప్పాజీమాటకు ఎదురాడే అలవాటులేక రాజ్య భారంతో బాటే, ఈ బరువూ ఎత్తడానికి మొగ్గాడు: అంతే కాని, అర్ధరివయసులో తనకు యీ పెళ్ళి ఎందుకు, - ఆ చిన్నది ఎలావుంటే మటుకు తన కెందుకు? ప్రార్థనల్లా ఒకటే! - ఈసారి అయినా ఆంధ్రనాయక స్వామి కరుణించి, మొగపిల్లవాణ్ణి యిస్తే - వంశం నిలుస్తుంది, - తానూ అప్పాజీ యిన్నాళ్ళుగా చేసిన నిర్వాహకం నిలుస్తుంది, - తిరుమలాంబిక నీళ్ళాడే ప్రొద్దులు! - ఆ చల్లని కబురు వినేం దుకే, రాయలవారి తహతహ! -

'ఈ రాత్రికే మీకు శోభనం నాయనా!' అంటే సరేనన్నాడు :- 'కాని, ఈ రాత్రి పిల్లదాని కంట నీవు పడ వద్దు!' అన్నా, అదేమని విస్తూరానికి చకితుడు కాకుండా సరే నన్నాడు!- కారణం ఏమిటో అప్పాజీ వివరించాడు___ 'గజపతుల గణమంతా జయించి తెచ్చామని, కత్తులు నూరు తున్నది- వాళ్ళతో కలసిమెలసి, సైనంతీసివ, పరిచారికలు, ఇది రూఢిచేశారు! చిన్నది, మేలి ముసుగుతోనే ఉంటూంది! అందువల్ల ఆ కవళిక గమనించడానికి ఆస్కారంలేకపోయింది.

అది ఒక్కే ప్రతాపం !– ఒంటరిగా పడకటింటిలో తొలిసారి తారసిల్లినప్పుడు, అక్కసుమీద,– ఏ ప్రమాదమన్నా జరగ వచ్చు ! అందుకని,– నీకు మారుగా, ముమ్మూర్తులా నీ ప్రతి మను, అక్కడ అమర్చాను ! నిలువెల్లా తేనె నింపాను !– నేను మాటున ఉండి, వైఖరి గమనించి, దుడుసుతనం చేసి, ఒరదూసినా, ఏదుటపడి, లొంగదీసి, నీకు అనుకువగా, మనసు కరిగిస్తాను !–'

మహామంత్రి, ఇంత ఎత్తువేశాడు !– చివరకు ఇలా అయినాడు !–

అప్పాజీ ఇలా బడుగు కావడానికి కారణం– గజపతుల కన్నె !– ఆడుది అని కనికరించ అవసరం లేదు !–

—ఒరలోనుంచి కత్తిదూకింది : రాయలవారు,– అంతకుమించిన ఒరవడితో, ఆ ప్రాసాదంలోకి దూకారు :

## ౪

ముఖమంటపంలో, ఆ ఒక్కతే అలనోకగా నిలుచుని ఉంది : రాయలవారు హుంకరింపుగా అంతవరకూ సాగారు: ఆ చిన్నది, అడుగు ముందుకువేసి, అరికట్టింది !– ఓరగా,– 'ఏమా ఘూకుడు!' అన్నట్టు. నిదానంగా మందలింపుగా చూసింది!– కన్నడ – రాయలు అరమోడ్పుగా చూపు కుదించుకుని,– కుడ్యభాగాలన్నీ, క్రొత్తగా చూస్తున్నట్టు చూశాడు : రతీమన్మథులు, ముక్కోటి వైఖరుల మురిసి

పోతున్నారు :- చూడగా చూడగా, కరాన గాద్గదికం,- గళాన కలవరం- రాయలవారు, ఒక్క- నిమేషం, మామూలు మనిషల్లే అయిపోయి,- అంతలో శ్రీవి సంబాళించుకుని,- కత్తి పదునంత కన్ను చేసి,- విసరపోయినారు :

వెరుపు లేకుండా నవ్వింది, ఆ ఒక్కతే, ఆ వీసుకీ ఝళిపింపుకు :

'తండ్రిపరువానికి, తలవంపులు కాదా ఈ ధుడుసుతనం, జయవీరా!-' అని కిలకిల లాడింది : ఒడ్డెపడుచు జాణతనం కన్నడ రాయలకు సోక లేదు : ఆ మాట మెలకువ విప్పి చెప్పేదాకా అర్థంకాలేదు : ఆ చిన్నదాని కంటివంక, చేతి కత్తి పదునువంక చూస్తూ చూపులు నానబెడుతున్నాడు:-

'మీ నాయనగారు, కంటపడ్డ దాసీపడుచును, ఒంటరిగా చూసి కౌగిలించేవారుకదా !- మీరు కత్తిదూయడం మరియూదా ?- ఎంత అమాయకులండీ!- ఏ అమ్మకన్న బిడ్డలండీ !-'

- ఎంతో అమాయికంగా, సంశయం తీర్చుకునేందుకు అడుగుతున్నట్టు, విన్నపాలాతూంది. ఆ చిన్నది- రాయలవారు ప్రజ్వలించిపోయినారు:-

-అంతఃపుర తోరణానికి, నులిమంచువంటి ఉలిపిరి తెర;- దాని వెనుక మరొకటి...

ఏడు తెరల వెనుక మెసలే బంగారుబొమ్మ- ఈ మాటలకు కిలకిల లాడింది!- ఇటు అడ్డం తొలగని చిన్నది:- రాయలవారంత ఉవ్వెత్తునా హానంగా నవ్వుతూంది:-

ఒక్క హుంకారముతో, చిన్నది, మల్లెదండల్లే రాలి పోయింది: రాయలవారి, రతనాలు తాపినబాకు, తెరలన్నీ మూసుకుపోయి, కిలకిలను కూల్చేసింది-

కూలిపోయింది - కన్నకూతురు, మోహనాంగి!- పిడిమీదుగా నెత్తురు చిమ్మకుండా గుండెపాదివి పట్టుకుంది, - చావు చాయలకు రాలేని నవ్వు నవ్వింది.

విజయలక్ష్మి నా నెచ్చెలి, ప్రభూ!- మీకు కత్తికి బాసికం కట్టించగానే,- కంఠం నరికేసుకుంది:- గజపతి మీకు దాసుడైనాడు: ఆ యింటి ఆడుపడుచు అవమానం తప్పించుకుంది-'

-రాయలవారు,- రాతిబొమ్మ:

'కత్తికొకనీతి,- గంటానికి ఒకనీతి వుంటుందని ఊహించ లేకపోయినాను: మహా మంత్రులకు హృదయంలేకపోవచ్చు!- మహారాజు- మహాకవి,- బిడ్డలకన్న తండ్రి, తిరుమలాంబికా ప్రాణేశ్వరులు- ఇంతటివారని, ఎన్నడూ కలగనలేదు-'

రాతిబొమ్మ కన్నీరు ద్రిమ్మరిస్తూంది-

కొనఊపిరి, ఇంకా పలుకుతూంది-

'కృష్ణరాయలు ధర్మప్రభువు!- అని, అమాయకులు అనుకుంటున్నారు- హిందువులందరూ కన్నతండ్రిగా భావిస్తు న్నారు- పాపం!-'

—రాయలవారు, కన్నతండ్రిగా - అమ్మా!- అని ఆక్రోశించాడు:-

'మీ మీద నాకు పగలేదు ప్రభూ :- రాజ్యకాంక్షకు ఏ యింటి పడుచైనా యిలా బలి కావలసిందే !- గజపతి, - మీ అంత వైభవేపేతుడు కాకపోయినా,- సాటి హిందూ ప్రభువు !- విజయలక్ష్మి, నావంటి ఆడుపడుచే !- కాని, మహారాజుకు ఎవరు హెచ్చరికలు చేస్తారు ?- మహామంత్రి ప్రజ్ఞాచక్షులకు ఇలాంటి అల్పవిషయాలు గోచరించవు కదా !- అవును,- అదే రాజనీతి!...అదే సామ్రాజ్యం...'

...బంగారపుబొమ్మ మంచు ముద్దైపోయింది: కన్నడ రాయల మనసు ,- తల్లి లేని పసిపాప అయింది :-

సర్వశూన్యంగావున్న అంతఃపురంలో పిడుగులు ఒరదూసుకున్నట్టు, ఝుళుక్ మని మ్రోగింది,- రాయలగుండెలో శోకం, - ఎక్కడిదక్కడే పేరుకుపోయింది : చిన్నరాణికి పరివారంగా తరలివచ్చిన, ఒడ్డె కన్నెలందరూ కన్నెత్రాచులల్లే ఒడ్డాణపుకత్తులు దూసి, కమ్ముకున్నారు :

విచ్చుకత్తుల వాడికి, రాయలవారు ప్రమాన్పడలేదు_ ఆకన్నెల కన్నుల రంపపుకోతకు విలావిలలైనాడు : ఎన్నడూ వంగని శిరస్సు, నేలకు సోకింది :

_అరవిచ్చిన మల్లెదండల్లే, మోహనాంగిని పుణికి పుచ్చుకుని, ఆ కన్నెలందరూ, - ఆవేశంతో దుమికే తరగలల్లే, - సన్నజాజులనీడలో శాశ్వతంగా జోకొట్టారు : తమ రాజధానికి, కలకాలం జ్ఞాపకంతో, తలవంచుకుని, వెళ్ళిపోయినారు.

—మోహనాంగిజాడ, నాగవాసంలో ఏనాటికీ తెలియ లేదు : ఆతల్లి ఆరాటానికి, అంతు లేదు; పిల్లదాని వైనం తెలియజెప్పడానికీ, ఊరడించడానికీ, మహామంత్రులుకాని, మహారాజుకాని, అంతఃపురం ఛాయలకు రా లేదు :

—మంచి ప్రొద్దురాకముందే తిరుమలాంబిక నీళ్లాడింది: బారెడు పిల్లవాడు :—

వసంతోద్యానంలో, దివ్యభవనం ఒకటి నూతనంగా వెలసింది : అది నివాస నికేతనమో, సమాధో — కారా గారమో, — ప్రజలకు అర్థంకా లేదు; అడిగి తెలుసుకునే నిబ్బరం ఎవరికీ లేదు.

ఎన్నడన్నా, 'పున్నమి వెన్నెల్లో'.— ఆభవనంలో వింత వెలుగులు తోచినట్టు, వేయివన్నెల కిలకిలలు వినిపించినట్లు, ప్రజలు, భయం—భయంగా భ్రమసిపోయేవారు. తెల్లవారిన తరువాత,— అదంతా, ఏదో చీకటి—చీకటిగా,— ఊహకు అందని శాపంగా చూసినవాళ్లకు కనిపించేది. చూడక పోయినా, తలచుకుంటే అలా అనిపించేది.

ఎవ్వరూ అడుగు అటు పడనిచ్చేవారుకాదు : ఒక్క— పెద్దన్నగారు మాత్రం— చుట్టపు చూపుగా కటికిచీకటుల్లో,— అటు వచారుచేస్తూ ఉండేవారు—

కాలం గడవగా— గడవగా,— 'అది చిన్నాదేవి, మేడ !' అంటూ ప్రజలు, రహస్యంగా తలచుకుని, ప్రభువును తలచుకుని, దద్దరిల్లేవారు :

—రాయలరాజ్యం యథా వైభవంగా సాగుతూంది: అష్టదిగ్గజాలకూ వృత్తి తుష్టి ఒనగూడుతూనే ఉంది: సత్సంతానముల సంకల్పానికీ, నిర్వాహణానికీ– ఏమీ లోటు లేదు–

కాని,– పెద్దన్నగారు,– పడిచిపోడు!...

...'ఆ తల్లి ఆత్మశాంతికి, యింతకాలం బ్రతికాను తిమ్మన్నా!—'

...తిమ్మన్న కంట నీరు వరదలౌతూంది. సభాభవనం నిశ్శబ్దంగా ఎలుగెత్తి రోదిస్తున్నది. చెమ్మతో చెదరిన చూపులకు, రాజధాని శిఖరగోపుర ప్రాసాదాలు, శిథిలాలై గోచరిస్తూన్నవి.

సభాభవనంముందు, తిమ్మన్న ఒక్కడూ నిట్టూర్పులై నిలచిపోయి ఉన్నాడు...

# ఆ లా ప న

గంగకు అద్దరిగా, రామలింగడు పవళించి ఉన్నాడు: ఇద్దరి, ఒళ్లంతా భయంలోకి కుదించుకుని,— అంతకుముందే నిద్రపోయింది: గది అవతల ఎక్కడో,— రాయలవారి అత్త గారు గుర్రు కొడుతూంది:

వీణ మోగింది: వాణి వెలసింది:

రామలింగడు కన్ను ఎత్తి చూశాడు:

వాణి నవ్వింది:

మెల్లిగా లేచి కూర్చున్నాడు: మళ్ళీ నవ్వింది:

ముక్కుమీద వేలు వేసుకుని, ఆ కిలకిల ఆపాడు: పక్కనున్న పడుచువంక చూసి, — "నీ కేమౌతుంది?"

వాణి, కసురుగా,— "నే నెవరినో తెలుసునా?" అన్నది:

"అహా! మరో ముగునవ్వు!– రాయలవారు, శృంగారం దెప్పించారన్న మాట –"

"నేను – వాణిని !" దివ్య – ధీమాతో పలికింది.

"అంటే ?"

"సరస్వతిని – భాషాదేవిని ! – నన్ను దానితో. పోలుస్తావా ? – ఇలా ఈసడింపుతావా ?."

రామలింగడు తొణుకూ బెణుకూ లేకుండా. పరకా యించి చూశాడు :

"నిన్ను, ఏమీ ఈసడించ లేదమ్మా ! –ఆడదానివి అన్నాను. కాదనిగదమాయిస్తే– నీయిష్టం !."

వాణికి నవ్వు వచ్చినట్టుంది : కాని, కోపం తెప్పించు కుంది.

"నేను సామాన్య మానవినైతే, – ఈవేళప్పుడు ఇక్కడ ఎలా ప్రత్యక్షం కాగలను ?"

రామలింగడు, మంచం చివరకు జరిగాడు.

"ఇదిగో పిల్లా – నీకు కోపం రాదంటే–నీకు తెలిసిందే అనుకో – ఒక్క సూక్ష్మం చెపుతాను :

అసలు – ఇంతకూ నీకు చదువు వచ్చునా ?

కాశీమజిలీలు చదివావా ?

ఫలానారాజు ఏం చేశాడు ?– ఒంటిస్తంభం మేడకట్టి– మేడంతా ఒక్కటే గదిగా కట్టి – గదిలో ఆ కుదుచును పెట్టి– అష్ట దిక్కులా పహారాపెట్టి – ద్వారబంధానికి, – కప్పతాళం పెట్టగా – ముద్రలు ముద్రలుగానే ఉండగా – ముగ్గురు బిడ్డల

తల్లి కాలా ?- ఎంతో కష్టంమీద, ఏ ఒక్క పోటీలోనో లోపలికి జొరబడ్డదనుకో - పాపం,- దానివల్ల ఏమైఉంటుంది ?

ఇంతకూ, ఏతావతా నే ననేది - ఆడది తెలుసుకోవాలిగాని - రావడానికి పోవడానికి అడ్డం ఏముంది ?"

- తిరిగి నడుం వాల్చిపోయాడు.

వాణికి ముచ్చెమటలూ పోసినవి. కళ్ల నీళ్ల పర్యంతం అయింది-

"నే నెవరో తెలియదా ?"

"రాజధానిలో యావన్మంది సుందరాంగుల నైనమూ, కరతలామలకమైన ఘటికుణ్ణి కాను. తతిమ్మా ఆస్థానకవులందరూ, - ఇందులో - ఘట్టి దిగ్గజాలు !- స్వాములు పూర్వాశ్రమంలోకూడా, - అంత ఉద్దండులు కారు !-

వాణికి ఒళ్లు తెలియని ఆవేశం వచ్చింది :

"దైవదూషణ చేస్తున్నావు ! నేను అనుగ్రహించక పోతే, - నీకు ఈ కవిత్వం ఎలా వచ్చిం దనుకున్నావ్ ?-"

రామలింగడు కనుబొమలు రిక్కించి ఊరుకున్నాడు ; వాణి, అనునయంగా -

"నన్ను పోల్చుకోరాదా - ప్రణమిల్ల రాదా ?" అని బ్రతిమాలింది.

"దానికేం - పోల్చుకోమంటే - నీమాట కాదనలేను కాని, - ప్రణయం అంటే మటుకు-"

వాణి, కన్నెమన బోయింది -

"మాటకు అడ్డంగా కోపంరాకు !- పాపం, యిందా కటినుంచీ అలాగే ఒళ్ళో ఉంచుకున్నావు, ఒసుసుకుంటూం దేమో - ఆ వీణ క్రిందకు దించుదూ :"

"ఉహుఁ - ఎప్పుడూ, నా అంకపాళిని, ఇలా ఉండ వలసిందే - కచ్ఛపి !"

"అలాగేం ? ఏదీ మోగించు !"

"నన్ను పరీక్షించుతున్నావా ?"

"తెలియక అడిగాననుకోరాదూ ?- అది, అలంకా రార్థమా ? - లేక, ఎన్నడన్నా, ఎడనెడ వాయించుతూం టావా ?"-

"వాణీ వీణా నినదం - నాగరలోక ప్రసిద్ధమేకద ?- నీవు పెద్దన్నగారి పద్యమన్నా చదువలేదా ? -

"పుండరీకాసనమున కూర్చుండి మదికి యింపుదళు కొత్త - వీణవాయించు - చెలువను !'

"సరిపోయింది: తాతయ్య పద్యమూ, నీ విద్యకు తార్కాణం ! పెద్దన్నగారు, వట్టి అమాయకుడు ! తెల్లనివన్నీ పాలు అని నమ్మేరకం !-

ఓనాడు ఏమైందనుకున్నావ్- ధూర్జటి అని మాతోటి ఆసామి వున్నాడులే : భసితాంగుడు : స్ఫటికాలంకృత వీనో రస్కుడు : ఆయన, పెద్దన్నగారి యింటికి వేంచేసి, ముద్దుకు, వాళ్ల మనవణ్ణి, చంటివాణ్ణి ఒళ్లోకి తీసుకున్నాడు: పసివాడు, వాళ్ళో స్ఫటికాలతో ఆడుకుంటున్నాడు :

పెద్దన్నగారు, - ఈ సైనం చూశారు :

'అదేమిటిరా అబ్బీ ! - పెద్దమనిషి యింటికివస్తే-అలా వాలకు ఎగబడతావేం!-'అని మనుమణ్ణి, తన ఒళ్లోకి లాక్కున్నారు : ధూర్జటి ఒళ్లో పిల్లాడు కూర్చున్నాడూ అంటే, - పాలకే అనుకున్నాడు ఆయన - అలాగే - ఒళ్ళో వీణ పెట్టుకు కూర్చుంటే,- వాయించుతావని భ్రమపడి ఉండచ్చు- ఆ పద్యాని కేంగాని - వాయించడం, ఎవరు నేర్పారు ? - గురువు హస్తవాసినిబట్టి - ఇలాటి విద్యలు రాణించుతా యుంటారు గద -

వాణికి, - మనిషికి వచ్చే రోషం వచ్చింది.

"వాణికి వీణావాదనము ఒకరు నేర్పాలా ? - అది నాకు సహజం !"

"నాకు - కవిత్వ మల్లేనా ? -

ఏం - ఏమిటి అలా చూస్తావ్ ! - నీకు వీణ వాయించడం దానంతట అదే అబ్బితే - నాకు పద్యాలు వాటంతట అవే పలుకరాదేం ! -"

"నీకు కవిత్వం ప్రసాదించిన దేవిని నేను !"

"ఇదిగో అమ్మాయ్ ! - ఉక్రోషంలో, నీకు అనేమాటేదో - అనని మాటేదో తెలియడం లేదు-

నీకు వీణ వాయించడం ప్రసాదించింది, నేను ! - అని నేను మోరాయించేటానికి పూనుకుంటే, - నీ మనసు ఎలా ఉంటుంది చెప్పు ? - చలి గుయ్యారంగా ఉన్న రాత్రి, నాతో ఇలా కబుర్లతో - కాలహరణం చేయడంకన్న నీ పడుచు

తనానికి మరో పరవడి లేదా యేం! – మనసు ఎక్కడా లేకపోతే – ఈపూటకు మాపక్కను పోయింది –"

"నిన్ను శపించేను సుమీ!"

రామలింగడు మీసం ఎత్తిపట్టి, పెదవి విరిచాడు – "నీకు అలాటి మక్కువే ఉంటే తీర్చుకోనమ్మ! – నీకు సాధారణంగా, వరమియ్యడమే అలవాటుకాని, శపించడం చేతనౌనా! – ఎలాగో చూపిస్తాను – ఇలారా! – వచ్చి, నా సను కూర్చుని, రెండు చేతులూ కంఠానికి పెనవేసి – ఆశాపమేదో అనేయ్ – అప్పుడుగాని పారను–"

వాణికి నవ్వు వచ్చింది –

"ఇంత మొండివాడివేం ?–"

"అంతా అంబ చలున! – ఇక వెళ్ళవమ్మా! – మీ ఆయనకు మెళకువవచ్చి పక్క తడుముకుంటే – చేసుకున్న ఇల్లాలంటూ ఉన్న తరువాత ఆ వయసులో చేతికన్నా తగలక పోతే – మరీ ఉసూరుమనదూ? – వాణి అక్కడ నిలువ లేదు:

రామలింగడు నవ్వుకుంటూ నడుంవాల్చబోతున్నాడు– బయట గుమ్మంలోనుంచి, – రాయలవారి అత్తగారు, నిదుర మత్తుగా పలుకరించింది –

"అమ్మా అంటున్నారు, – ఏమిటి స్వామీ–"

"మీ అమ్మ సంగతే–"

ఆ మాట విని అత్తగారు, కొంచెం చొరవగా గుమ్మంలోకి వచ్చింది: చూసి వెనక్కు తగ్గింది.

"తగ్గుతా వెందుకూ, – రా, – సన్యాసి ఎక్కడున్నా సన్యాసే – ఇదీ మన తీరు. – నీ వక్కడా, – నే నిక్కడా –"
రామలింగడు లేచి రెండడుగులు ముందుకు వేశాడు –

"స్వామీ–చిన్నదానివల్ల ఏమన్నా అపరాధం ఉంటే– పాదసేవ నేను చేస్తాను" అంటూ అత్తగారు చేయి జాచింది.

రామలింగడు పతాకతో వారించాడు –

"నీకు అంత పటుత్వం ఉందని మాకు తెలుసును. ఆనాడు మీా అవ్వ యీామాటే అంది –"

అత్తగారి ఆశ్చర్యానికి అంతులేకపోయింది– "స్వామీ!– మా అవ్వకు తమ సేవ లభించిందా ?–"

"ప్చ ! – రవంతలో బెడిసిపోయింది – ఆ ధరకు మొగ్గ లేకపోయినాం, – కాశీకి ప్రయాణమైనాం – తరువాతనే విధి లేక కన్నెరికమైనట్టు – శిష్యులవల్ల, కర్ణాకర్ణిగా విన్నాం – ఛూ – ఆ పూర్వాశ్రమపు మమతలు తలచుకుంటే – నీకూ నాకూ అపచారం జరిగేట్టుంది – పోయి పడుకో – వెళ్ళేప్పుడు తలుపు బయట వేసేయి ! – ఏం విన్నా. – నిన్ను కాదనుకో – భగవన్నామస్మరణ చేస్తూ, పట్టినంత నిద్రపో–" అత్తగారు అటు మళ్ళింది, – రామలింగడు యిటు తిరిగాడు –

౨

పిల్లలమర్రివారి యింట్లో, – ముందు నడవాలో, – బంగారు సెమ్మాలో జ్యోతి ఘుమఘుమ లాడుతూ వెలుగుతూంది :

కొత్తగా అమర్చిన హంసతూలికా తల్పంమీద, – అన్నయ్యా – వదినా ఆదమరచి ఏకంగా నిద్రపోతున్నారు, మంచువాకు ఆ పక్కగదిలో –

ఇనపతీగె పక్క నవారాలో – ఒంటిరెక్క మంచం వాల్చి ఉంది:

వాణి దూకుడుగా అవతరించి,–దానిమీద కూర్చుంది: అలా, ఎంతోసేపు కూర్చుంది: బద్ధకంగా కూర్చుంది: పక్క, చేతికి పదునుగా సోకుతూంది: వాణి నడుం వాల్చింది. కాపురంచేసే అలవాటుకొద్ది – ఒదిగి, – అవతల, చోటు ఉంచింది.

అలవోకగా, ఖాళీ మీదికి, వాణి చేయి జాపింది. మనసు జల్లుమన్నట్టు లేతగా వణికింది. పుటుక్కున తీగల్లే ఎగిరి కూర్చుంది. పెదవి అదిరదిరి పడుతూంది:

చీకట్లోంచి కూనిరాగం, ఈ సరసకు వస్తూంది. వస్తూ వస్తూ ఆగిపోయింది –

పినవీరన్న పక్క వైపు పరాయించి చూచాడు – అడుగులో అడుగు వేసుకొంటూ రానే వచ్చాడు –

"ఎవరది ?"

"నీ రాణి !"

పినవీరన్న ఒంటిపోచ జంధ్యం వేలికి మెలివేస్తూ వింత పోయినట్టు నవ్వాడు:

"ఎవరో అయిన యింటి పిల్లకు, అర్ధరాత్రి అంకమ్మ శివమెత్తింది - పాపం ! - నాకన్న నసిఅయిన సరసు డెవరికీ తీరిక లేదేమో -

"ఇక్కడికి ఎలా వచ్చావ్ ?"

వాణి బుసకొట్టింది-

"ఎందుకు వచ్చావని అడగవేం ? -

"అడిగానే అనుకో : ఇంత కసుగాయవా తమ్ముడూ అని కామన్న ఆక్షేపించడూ-"

"ఊహుఁ నే ననుకున్నది నిజమేనన్న మాట-"

"ఏమిటా మాట ?"

"ఏమిటా - ?" వాణికి ఇక తామసం ఆగిందికాదు-

"నీవు మనిషివి కాదూ ! కవినంటూ రొమ్ము విరుచుకు తిరుగుతున్నావే - నీతీ జాతీ అంటూ లేదూ-"

-పినవీరన్న తెల్లబోయినాడు-

"ఇదిగో, పిల్లా - అలా బాకాపట్టకు - గొంతు దింపు - మా వదిన విన్నదా అంటే."

"-ఎవరు విన్నా ఇంకా పోయేదేముంది ? - నన్ను, నలుగురి నోళ్లలో యిదివరకే పడేశావు!"

"నేనే ?-"

"ఇంకా, 'నేనే!' అంటావా? - పరాయివాడి భార్యను పట్టుకు - 'అది నా రాణి !' అని చాటిస్తావా ?-"

"ఏమిటే ?-" పినవీరన్న తెల్లపోయినాడు - ఒక్క నిమిషం ఆలోచించాడు : బిగ్గరగా నవ్వేశాడు -

"ఓ ! – నీవు బ్రహ్మదేవుడి పెళ్ళానివా అవ్వా !–"

వాణి కళ్ళల్లో భైరవి రాగం పలుకుతూంది – అవ్వా అనగానే –

"అయితే కూర్చో – కథేమిటో చెప్తాను–"

వాణి మోరాయించింది. కాని, పినవీరన్న అపుడు దగ్గిరగా వేయగానే – బుజాలు పట్టుకు కూర్చోబెడతాడేమో నని, – వయ్యారంగా, – త్రిభంగిగా, – కూర్చున్నది –

" – నిన్ను నా రాణి అన్నమాట, నిజమే ! –

"కాని, – అన్నది నేనుకాదు – మా వదిన ! –

"కాదన్నానే అనుకో – ఇందుకు మళ్లా ఓ రాద్ధాంతం బయలుదేరుతుంది, ఇంట్లో – ఆవిడ నోటికి దొరచి వ్రాయకో వలసి వచ్చింది – పైగా ఈ అభాండంవల్ల .నీకు పోయే దేముందిలే అనుకున్నా గాని, –

తామరపువ్వు విసిరినట్టు వాణి పినవీరన్న మీదికి చేయి చాపి – మాటకు అడ్డంవచ్చింది –

"నాకు పోయే దేముందా ? – ఈ మాట మావారి చెవిని పడితే – నా కాపురం ఏమైపోతుంది ? –

సాటి ఆడది,–నన్ను పట్టుకు యింతమాటఅటుందా? – ఆ యిల్లాలినే నిలవేస్తానుండు – " అని లేవపోయింది. పిన వీరన్న సంభ్రమంతో అపవారించాడు –

"నీ పుణ్యమాయెగాని, – ఆ పనిమాత్రం చేయకు ! ఇప్పుడు ఆవిడ కంటబడ్డావా అంటే – అటూగాకుండా ఇటూ గాకుండా అయిపోతావు ! ఆవిడకు, జ్ఞాపకశక్తి అనంతం –

ముక్కోటి దేవతల పుట్టుపూర్వోత్తరాలు పేరు పేరు వారీగా
ఆవిడకు తెలుసు - నిలవేసి అవన్నీ తవ్విపోసిందా అంటే, -
కల్పాంతానికైనా, మళ్లీ నీకు గుక్క తిరగదు – ”

వాణి – ఈసూ – రోషం గిలిగింతతో చిరునవ్వుగా –

“మీ వదిన అంత గయ్యాళి అన్నమాట !” అని
కులికింది.

“అన్నమా టేమిటి ? – గయ్యాళే – పరమగయ్యాళి –
అన్నయ్య ఎప్పుడూ, మనసులో యీ ముక్కే జపిస్తూ
ఉంటాడు.”

“పాపం ఎలా వేగుతున్నాడో – ఆ మానవుడు–” అని
వాణీ,– జాలిగా అనపోయింది.

“అందుకే – నేను యిలా ఉండిపోదామనుకున్నాను.
వదిన, నన్నూ కొన్నాళ్ళు రంపకోత కోసింది – నన్నో
యింటివాణ్ణి చేస్తే, ఆ వచ్చే కుర్రదాన్ని వేపుకు తినవచ్చును
కదా అని –

ఈ ఒక్క అంశంమీద మా ఉభయులకూ అనేక
దివ్యవర్షాలు శాంతిసమరం సాగింది – తతిమ్మా ఏ విషయంలో
అయినా, నేను మావదిన కళ్ళముందు పిల్లికూననే; కాని
ఇందుకు మాత్రం ప్రాణాలొడ్డి అయినా ప్రతిఘటించ తలచు
కున్నాను.

సరే ప్రాణంమీద ఆశతీరిన తరువాత కవిత్వం అదే
ఆవేశించింది—” వాణికి యీ చిగురు ముక్కలు అర్థం
కానంత ఆశ్చర్యం వేసింది–

"అంటే-" అని తెల్లబోయింది- పిసనీరన్న, ఖచ్చి తంగా,-

"అంతే-ఏదో పిట్టకు ప్రాణంపోగానే,- వాల్మీకికి కవిత్వం వచ్చింది- నాకు, నాప్రాణాం ఉన్నాసరే పోయినా సరే అనే స్థితిలో- అది పట్టుకుంది- పద్యానికి పద్యం తెగు లనీ,- అదే ఒకటై,- రెండై- చివరకు అంత గ్రంథం అయింది. ఆ తరువాత కథంతా, కేవలం అన్నయ్య లౌక్యం. రాజుగారి దగ్గర మరో పదిడబ్బులు ఎక్కువ రాలడానికి- ఇదోవంక పెట్టాడు !- రాజుగారిని శ్రీరివాడిక్రింద కట్టి. వాడ వాడంతా, అదేపాట మొదలు పెట్టింది-

"కాని, - నాకు ఒకటే సందేహం -

అన్నయ్య, చెపితే చెప్పాడు పో - పిల్లిల్లు బంగారం గానూ - వాళ్లు ఎలా నమ్మారో ? -

నేనేమో పగలంతా ఆగమ్మ కాకిలాగా తిరిగి, - రాత్రి గదిలో తలుపు బిగించుకుని, - కుక్కలో కునుకుతున్నానట - ఓ అర్ధరాత్రివేళ, నీవు, - ఘల్లున సాక్షాత్కరించి, నా దగ్గిర కూలబడి, - గాజుల గలగలలో, - కావ్యం అల్లేశావట ! - దేవలోకంలో ఉండే చిన్నది కదా, - తెలుగెప్పుడు నేర్చు కుంది, - గణయతి ప్రాసలు ఎలా కంఠతా పట్టింది ? - అని, ఒక్కడన్నా ముక్కుమీద వేలు వేసుకోండే ? - అందరూ డూ డూ బసవన్నలు ! - "

— వాణి, ఉలకదు, పలకదు : అనిమేషనయనాలు రెండూ, అతడి మొగానికి అప్పగించి వూరుకుంది -

"ఇదీ, ఇందులో ఉన్న దేవరహస్యం - కాని, నామాట లేమీ నువ్వు నమ్మినట్టు తోచడంలేదే! -"

వాణి రోషంతో, - "మామూలు మనిషి ఆశిస్తే, అబద్ధం-నీవాడితే కవిత్వం-నీవు అని, వదినమీద పెడుతున్నావా? నాటి ఆడదానికీ నాకూ ఈ రూపేణా తగూపెట్టి, నీవు తప్పుకుని చోద్యం చూడాలని కులుకుతున్నావా?- ఇప్పటి కైనా, చేసిన తప్పు ఒప్పుకో, - ఇక ఎన్నటికీ ఇలాటి అప చారం మనసా - వాచా కర్మణా చేయనని ప్రాధేయపడితే,- కరుణించి - భయం మిస్తాను -

—వింటున్నకొద్దీ, పినవీరన్న జుట్టు కోపంతో గింగి రాలు తిరిగింది. చిరుమీసం కజ్జాకు కాలుదువ్వింది.

"కరుణించి వదిలేద్దామనుకున్నాగాని. - ఆ మర్యాద దక్కించుకోలేక పోయినావ్ -

"అవ్వా! - ఒక్కటే ముక్క చెపుతా విను - యీ లోకం గొడ్డుపోయిం దనుకున్నావా? - నదరైన పడుచు కరవైందనుకున్నావా? నాకు అలాటి మనసే ఉంటే, - అవ్వను పట్టుకు వసంతాలాడే అగత్యం లేదు - నాలాటివాడి రాణివని అపవాదు వచ్చినా, - ఈ వయసులో నీకు పరువేగాని, - నేను సాటివారిలో తల ఎత్తుకు తిరగగలనా? - త్రిభువనాల్లో నిన్ను భరించగల ముదుసలి ఒక్క బ్రహ్మన్నే - మీ యిద్దరికీ యీడూ జోడూ కుదిరింది - ఆయన జటాజూటం, నీ కబరీ భరం - అచ్చంగా పండువెన్నెలే - సర్వ శుక్లా! - ఈ సరసం చాలిద్దామా?" - పినవీరన్న నిర్లక్ష్యంగా అక్కడ

నుంచి వెళ్ళిపోయినాక – వాణి ఉసూరు మంటూ వెన్నెల్లో కలిసిపోయింది.

౩

"ఇక్కడనుంచి ఎక్కడికమ్మా !" అని వగర్చుకుంటూ అడిగింది, – హంస : వాణి, – చిర్రూ బుస్సుమంది –

"అడిగావ్, శకునపక్షీ ? – ఎక్కడికైతే నీ కెందుకే, నోరుమూసుకు ఎగురు !– నేను వాలమన్నప్పుడు వాలు –"

పోగా పోగా అన్నీ రాళ్ళూ రప్పలూ –

"ఆ రాయిముందు వాలు !"

అక్కడ ఒకటి కాదు, రెండు రాళ్ళున్నాయి–ఎదురూ బదురుగా, ఒకటి రామవిగ్రహం – రెండోది పోతన్న :

వాణి, హంసమీదించి క్రిందికి దూకింది. మీది మీదికి ఛూకుడుగా వెళ్ళింది, – ఆగిపోయింది – పోతన్న కనురెప్ప అయినా కదల్చకుండా, ఏదో సీసపద్య ధోరణి గొణుక్కుంటున్నాడు –

ఆ భాగవతుడి పరాకాష్ఠ, నిర్లక్ష్యం అనుకుని,– అమ్మవారు అంతలో ఆడదైపోయింది, – వెనుకవైపు చేతిలో లీలాకమలం, కళ్ళకు అడ్డం పెట్టుకుని,– మానవ పరిభాషలో – ఏడవటం మొదలు పెట్టింది – వెనువెంటనే చేతిలో అలవోకగా ఉన్న కచ్ఛపి శ్రుతి అందుకుని తానూ అనుగుణ్యంగా మోగటం ప్రారంభించింది : తిప్పటతో సతమతమైపోయి, అప్పుడే తెప్పరిలుతూన్న హంసకు ఈ ఘోష దుస్సహమని

పించి, – రెక్క విప్పి చెవులు మూసుకుంది: కాని లాభం లేదనిపించింది: గునగున పోతన్నగారి దగ్గరకు వెళ్ళి, చేతి గంటం, తాటాకూ రెక్కతో ఎగురగొట్టి, – ముక్కుతో పొడుస్తూ – ఆ గొడవేదో కాస్త ఆలించవయ్యా !– అన్నట్టు తంటాలు పడ్డది.

పోతన్న కన్ను విప్పాడు – వాణి కనబడ్డది– దేవతలను అనుక్షణం చూడ్డానికి అలవాటైనచూపల్లే – సంభ్రమం ఏమా త్రమూ లేకుండా, – నిదానంగా 'ఓ, నీవా?' అన్నట్టు రవంత కను మెలిపాడు – ఇంతలో ఆ కంట తడి కని పెట్టాడు – పద్యం అందుకున్నాడు – 'కాటుక కంటి నీరు___'

వాణి గప్పున, తామరతూడులు ఎడాపెడా విసిరినట్టు చేతులతో రొమ్ముకట్టుకుని – "అంతటితో ఆగు!" అని కేక వేసింది–

పోతన్న అతి వినయంగా – "ఆగుతే, పద్యం పూర్తి కాదు శారదా!" అన్నాడు–

"నాపరువు పోయిన తరువాత – నీ పద్యం పూర్తి అయితే నేం – కాకపోతే నేం – పోతన్నా - నన్ను ఇంతవంచన చేస్తావా!

పోతన్న, అమాయకంగా – "నిన్నా" అని నిజంగానే అన్నాడు.

"ఇంకా 'నిన్నా' అంటావా? – నన్ను తీసుకువెళ్ళి నా మామగారికి అంకితం చేస్తావా?"

పోతన్న ఒక్కక్షణం పరకాయించి ఆలోచించి, – నవ్వేశాడు.

"ఇందుకటమ్మా నీ విచారం! -మీ దేవతల్లోకూడా వయసా వావుల విషయంలో ఇంత పట్టింపు ఉందన్న మాట- అయితే మీకన్న మేమే నయం - ఈ ముక్క అడగడం కోసం - ఇంతదూరం వచ్చావా! - పాపం!-" విని, వాణి తబ్బిబ్బైంది-

"నేను అడిగినదానికి ఇదేనా నీ సమాధానం! -" అంటూ, కసిరినట్టు అడిగింది.

" ఏం సమాధానం కావాలి?"

"చేసిన తప్పు ఒప్పుకో - దిద్దుకో!"

"అసంభవం చిన్నదానా!- మనరాత, మీ ఆయన రాతకన్న దొడ్డది - అది అంతే!- మారదు - నీవు, పనిగా కయ్యానికివచ్చావు గనుక అనవలసిన నాలుగుమాటలు మొగమాటం లేకుండా అనేస్తాను-మనం పలికేది,-భాగవతం పలికించేవాడు, అడుగో, వాడు!-ఇందులో నీప్రశక్తి ఎక్కడుంది! నాకుఅబ్బిన అంతో ఇంతో పాండిత్యం-సహజం! - అంతే,- ఏదైనా వాడి చలవే-" వాణి, మాటకు అడ్డంవచ్చి, కస కసగా, "ఇలా పెడసరంగా మాట్లాడటమేనా సహజ పాండిత్యం -!" అంది: పోతన్న ఆ చిడిముడి పాటు గమనించకుండా - "కాదు - ఆడదానివని, - ఇంతవరకూ మర్యాదగా మాట్లాడటం - ఇక పరువుగా, వచ్చిన దోవనే వెంచేయ్- కోదండరాముడికి అంకితం కావడం తలవంపులైందీ నీకు? - కానీ చూద్దాం - ఎల్లకాలం ఇలాగే ఉంటుందా, - ఎవడో శ్రీఘనుడు ఏ అగ్రహారానికో కక్కుర్తిపడి, నిన్ను ఏ

గుఱ్ఱాలుకాసే సాయెబుకో కట్టబెట్టాడనుకో - అప్పుడు ఈ పసుపూ మర్యాదలు ఏమౌతాయో మరి_"

మాటల్లోనే వాణి మాయమైంది - పోతన్న తనలో తాను నవ్వుకుంటూ రాముడి సన్నిధికి వచ్చి కూర్చున్నాడు. ఇంతసేపటినుంచీ నక్కి కూర్చున్న హంస, రెక్కలు విరుచుకునీ వచ్చి, - గంటం అందించి, - తల ఆయన తొడమీద పెట్టుకుని ఆదమరచి పడుకున్నది.

# మ ధు ర

మనది, – పట్టపవలే చుంచులూ, ఎలుకలూ కోలాహలంగా విహారించే,– వెలుగు చీకటుల మారుమూల గది: విడిసినవాడు, సాక్షాత్తూ మహాకవి – అతిథి మర్యాదలు ఇక్కడేం జరుగుతాయి ?–

పవలంతా ఎక్కడెక్కడో తిరిగాడు, పూలదండలు జమ చేసుకున్నాడు–చీకటి పడుతూండగా, తిరిగి వేంచేశాడు–

'భోజనం అయిందా, అన్నా !–' అన్నాను, వేసిన తాళం తీస్తూ–

'రాత్రిపూట,– మనం అపక్వాహారులమా !' ఉన్న ఒక్క కుర్చీలోనూ, లుంగలాగా కూలబడి– నాకు అర్థం అయేంత నవ్వు నవ్వాడు,

నేను వినిపించుకోకుండా- 'అయితే, నేను మంచి మాట చెప్పేరానా?- వచ్చేటప్పుడు మందుసామాను ఏమన్నా కావాలంటే తెస్తాను-ఏం?' అని కదిలాను-

మహాకవి- ఎంతో ఆపదలో ఉన్న ఖంగారుతో,- నన్ను నిలవేశాడు.

'మన్మథుడు, యీ రాత్రికి నన్ను బ్రతికిస్తాడంటావా?-' అని బ్రతిమాలుకున్నాడు.

'నీకా భయం ఎందుకురా?-వాడి ఆయుధాలన్నీ యిటీవల యూనియన్ ప్రభుత్వం స్వాధీనం చేసుకుందని పత్రికల్లో చదవలేదూ?-

'మనగదిలో పడుకుంటే, మన్మథుడు, తేరిమాడ లేడోయ్!-ఆబాధ ఏదీ ఉండదు,-ఎలికలతోనే రగడ-కాని, అవి మామూలు ఎలికలనుకునేవ్-చాశీతి బంధాలూ తున్నాంగా వచ్చిన ప్రోషలు- ఏదో శాపం కొద్దీ-నందనవనంలో అచ్చర పిండంతా,- యిలా కిచకిచలాడుతూ - మన గదిని ఆశ్రయించిందేమోనని, - నా నమ్మకం - అయినా, అనుభవించబోతూ-'

నేను వెళ్ళకోళ్ళానికి అంటున్నానని తెలిపికూడా. - మహాకవి కంగారైపోయినాడు - మూటాముల్లె కట్టుకపోయి తెల్లవాళ్లా స్టేషనులో అన్నా పడిఉంటానుగాని, యిక్కడ ఉండనన్నాడు – పదువుచుట్ట బిగిస్తూ, నన్ను తిడుతున్నట్టు ఏదో సణుక్కున్నాడు - తిథివార నక్షత్రాలమీద నోట చేసుకున్నాడు - తన జీవితంలో ఏ రాత్రి యింత గొప్పపోతే

'ఏంరా, బాబూ!- ఇవాళటికి, నేను బ్రతికి నట్టేనా?- ఎగిరి నా కంఠం పెనవేసుకున్నాడు- మనిషి సల సలా క్రాగి పోతున్నాడు.

'ఎలాగై తేనేం-చావు తప్పిందే అనుకో,-కాని,-కన్ను లొట్టపడితే-అది నీకర్మం-' చాలా విసుగ్గా అన్నాను.

'అంటే?-'

'అంతే-'

'అదేమిటిరా బాబూ!- పొడుపు కథల్లే మాట్లాడితే ఎలా?-అసలు సంగతి ఏమిటో చెప్పు-'

చెప్పరా బాబూ! అని కాలావేలాపడి బ్రతిమాల నిచ్చిన తరువాత, వాడికి చెప్పవలసిన మాట.- వాడికి చెప్పాను. అందుకు, సింగారించుకోమన్నాను- నీకు యీ రాత్రి ముచ్చటకు కానీ ఖర్చు లేదు. పర్సు పట్టుకు వెళ్ళవల సిన అగత్యం లేదన్నాను. ఇక వెళ్ళిరమ్మన్నాను.

'ఎక్కడికి?- ఎవరాసుందరాంగి - మహాకవి మనసు ఎరిగి వర్తించగల జాణయేనా?-' ఈ ప్రశ్న లన్నింటికి జవా బుగా ఒక్కటే కసురు కసిరాను - మహాకవి, ఆపేక్షగా - 'అదేమిటిరా బాబూ !- ఎందుకంత విసుగు ?' అని నోటితో అన్నట్టు అని,- 'నాకు ఉందనీ నీకు లేదనీ ఎందుకోయ్ ఆ ఏడుపు?-' అన్నట్టు నొసలుతో స్పష్టంగా యద్దేవా చేశాడు.

చాచి ఒక్కటి పుచ్చుకుని,- కుక్కిలో ఎత్తి కుదేసి,- వెన్ను వాచేటట్టు చిచ్చికొడదామని - చేతిదాకా వచ్చింది-

ఇంతలో,- వీధిగోడ అవతలనుంచి, 'బాబూ !' అని కేక వినపడ్డది.

'ఆ !' అని పలికాను. 'ఎవరది !' అని, మూడు కేక వేశాను.

'నేనే నయ్యా ! - అప్పన్నని-

'రా,_ లోపలికిరా !' అంటూనే, మహాకవితో- 'అది గోనయ్యా ! - మీ ప్రియురాలు,- అందుబాటులో ఉన్న నెచ్చెలిని .రాయబారం అంపింది. యిచ్చిందేదో త్రాగు, పెట్టిందేమో తిను,- పక్క మరీసుతిమెత్తగా ఉంటే ఓకునుకు పట్టించుకో- లేపకముండే. లేచిరా-

ఇవన్నీ - ఈ హితోపదేశమంతా, తిట్లక్రింద జమ వేసుకుని,- మహాకవి, అవన్నీ దులుపుకుని,- అప్పన్నను అనుసరించాడు- నేను, మన మామూలు చాంద్రాయణ మంతాకానిచ్చి,- మామూలు వేళకే,- నిశ్చింతగా, నడుం వాల్చాను-

తెల్లవారుతూందనగా, నిత్యమూ, - దాసీపడుచు, కస- నలిగినపైట సర్దుకుంటూ, ఒళ్ళు తగని బద్ధకంగా విరుచుకుంటూ, వచ్చి, నిద్రమత్తు కేక వేస్తుంది- ఇవాళ, - అయ్యది రావడం ఆలస్యం చేసింది- ఆవేళకే, మహాకవి, కూనిరాగముతో,- మల్లెపువ్వల్లె,- చెక్కు చెదరకుండా, తిరిగివచ్చాడు- ఏనుగు నెక్కినంత సంబరాలతో వచ్చాడు.-

'ఏమిటోయ్!-విశేషం!-' అతడి వాలకంతో చిరాకు ఎత్తుకొచ్చి సణిగినట్టు అడిగాను.

'ఏమి కేమిటి?-జన్మకల్లా యిదే విశేషం!- పృష్ఠ బుష్ఠిరి ... తెకుపాత-యింత పుణ్యం చేసుకున్న పాపాన పోలేదురా, ...!-'

నేను మాటకు అడ్డం వెళ్ళాను-

'అన్ని మర్యాదలూ సరిగ్గా జరిగినట్టేనా?'- నేను ... ఎక ... అన్నాను కాని,- మహాకవి,- అది లక్ష్యపెట్టే ధోరణిలో లేడు,

'ఆహా!- అన్నీ యథావిధిగా జరిగినాయ్!'

'అన్నీ!'- 'అ'నుకూడా వత్తి అడిగాను.

'ఏమిటి ఆకొంటె ప్రశ్న?- ఎందుకు వెళ్ళాన నుకున్నావ్?-' తిప్పికొట్టా ననుకున్నాడు-

'ఏమో - ఎందుకన్నా వెళ్ళవచ్చు!- నీ పద్యాలు చదివి వినిపించావేమోనని అడిగా?-' మహాకవి,- మాట వింటూ - వింటూనే తెల్లమొగం వేశాడు - నేను ఇంకా సాగదీశాను.

'అయితేనేం లే? అది నీకు మామూలేగా! పోనీ, తిన్నగా చూశారా?___

'దేవుడల్లే చూశారు. అందులో, మన ప్రతాపం ఏముంది లే!- అంతా,- నీ పలుకుబడి!-

'ఇదివరకు,- నా పద్యాల్ని విమర్శించిన హేమా హేమీలందరూ- కనకం కాలిగోటికి బలాదూరు!- ఒక్కొక్క పాదంలో, నేను ఊహించని భావాలు ఎన్నో - ఎన్నెన్నో విప్పిచెప్పింది - టాగూర్, బారువా, హిమాంశురాయ్,

శరీరక సుఖవృష్టి – ఇంకా ఎందరో నాటకీయుల పద్యాల్లోంచి,
గతించా వచనించి–'

'పిల్లలందరికీ పద్యాలూ – పాటలూ? – చదివిందా!
పాడిందా?–'

'పయ్– నీ లక్కరితనం నాకు తెలుసు గాని,–మాటలకి
అర్థంరాక!– పూర్వకాలం వాటకీ ప్రస్తుతంలో ఇలాగే ఉపాసించే
లుంటే వారి వరకే మేకాని– కలకం,– వాళ్ళందరికీ మించిం
దోయ్–'

'మీరు కలకం అని చెప్పిందా?'

'చెపితే ఏం?– అవికాదా?

'–నాకేపోతేనేం– వట్టి కలకం కాదు, పరిపూర్ణంచే ఒక
దయార్ద్రస్నే మిసిమి– పసిండి–'

–'తెల్లవార్లూ ఇలాగే జాగరణ చేసి వచ్చావన్న
మాట!—'

'వేయి రాత్రులైనా ఇలాగే గడిపి గలను– అది
వేశ్యాగృహం కాదురా బాబూ, సాక్షాత్ దేవతా మందిరం–'

నాకు వల్లమాలిన ఆశ్చర్యం వేసుకొచ్చిందని వాడు
కనిపెట్టేంతవరకూ,– 'ఆ!' అని అలాగే గ్రుడ్లు అప్పగించి
చూస్తున్నాను.

'నిజమేరా బాబూ, ప్రత్యక్ష అనుభవం – అక్కడ
ఉన్నంతసేపూ, దేవతామూర్తి సన్నిధానంలో ఉన్నట్టు అనిపిం
చింది; మనస్సుకు,– అంతరాత్మకు, ఎంతో అనిర్వచనీయ
ఆనందం కలిగింది– అది,– ఏనాడో,– దేవాలయం!–'

'నిజము, మహాకవీ– చరిత్రగర్భంలో ఉన్న సత్యం – నిన్నుచూచి ప్రసవించింది. అది ఓనాడు దేవాలయమే!–' అతి వినయంగా, నమస్కారము చేశాను.

మహాకవి,– ఓ పట్టాన నిజమేనని నమ్మడానికి నిరాకరించాడు. ఒట్లూ సత్యాలూ వేయించుకుందామని పెనుగులాడాను: ఈ ఐతిహ్యం, మన స్వంతానికి చెందింది కాదు గనక,– అంతకు నేను పూచీపడనన్నాను,– కాని, కథేమిటో చెపుతానని మొగ్గాను– ఆ చెప్పడమన్నా, అప్పుడు, నిలుచున్నపళాన కాదు,–నిదానంగా.

మహాకవికి,–కాఫీ త్రాగేందుకన్నా కన్ను తెరిపిని పడనంత బద్ధకంగాఉంది– హోటలులో కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు – బలవంతాన ఆవలిస్తున్నాడు–

ఎలాగో మూతి తుడుచుకుని, పిడిదికి, తూలుకుంటూ వచ్చి,– పక్క–చుట్టమీాద ఆనుకుని, లుంగల్లే నడుం వాల్చాడు–

'జాగారంవిశేషాలు ఏమిటోయ్?' – మహాకవి చిరాకుగా, కసురుగా, మూలిగి ఒళ్ళు విరుచుకుంటూ, పక్కకుదుర్చుకున్నాడు.

'తెల్లవార్లూ ఏంచేశారు?' – బూతు విసిరినంత వడుపుగా అడిగాను – 'ఎన్ని వలపులు వలచావ్?'

మహాకవి, తన్నితే ఎగిరిపడ్డట్టు లేచి కూర్చున్నాడు–

'ఒరేయ్!– నీ బుద్ధి ఎప్పుడూ యింతే!– నీకు, కుడీ ఎడమా లేదు; ఉచ్చ నీచాలంటూ లేవు– పరమ అప్రాచ్యుడవు!–'

కాకాయిని కసిరినట్టు కసిరితే - వాక్యం అక్కడికి ఆగింది- 'బజ్జోరా, కన్నా! అంటూ, మొన్న ఆ సినీమా దేంట్లోనో యశోద ఉరిమినట్టు - కొంచెం ఊతంగా చిచ్చి కొట్టాను; నన్ను ఉద్ధరించినట్టు.- కళ్ళుమూశాడు-

రాత్రి మెయిలుకు, మహాకవి వెళ్లిపోతాడని గట్టి నమ్మకం- కాని,- సంజెపడిన తరువాత రైలుమాట ఎత్తడం మానేసి,- మళ్లీ నస మొదలుపెట్టాడు-

'నిన్న, చలిదీరిందికా,- మళ్లా రాయబారం ఎందుకూ?- మహారాజశ్రీ పోయిరా!-' అన్నాను.

'పోయిరావడానికి అభ్యంతరం లేదు కాని,- ఎందు కైనా మంచిదని, అంటున్నాను- కాకిచేత కబురంపి తేచాలు,-' మహాకవి, యికిలించాడు-

'ఈ నగరంలో, కాకులు చీకటి తప్పులు చెయ్యవ్! నీవే దయచెయ్యి!-'

-మహాకవి నన్ను నిలవేసి కజ్జాకు దిగుదామనే ధోరణిగా మొగం పెట్టాడు; కాని, అంత అదృష్టంలేకుండా,- 'అయ్యా, శాస్త్రుల్లుగారూ' అని కేకవేసి, కేకను వెన్నంటి,- కనకం తల్లి గుమ్మం దగ్గిరికి వచ్చింది.

మహాకవి, గంపెడు బులబాటంతో,

'దయచేయండి - రండి, లోపలకి-' హడావుడిగా ప్రత్యుత్థానం చేశాడు -

'ఏం, కోటమ్మా!- కుంకుమభరిణ తేకుండా వట్టిచేతులతో వచ్చావ్!' అని పలుకరించాను _

'అదేమిటి అయ్యా!' అంటూ తెల్లబోయింది.

'—ఏం లేదులే!- అయ్యవారిని. పేరంటానికి పిలవ డానికి వచ్చాననుకున్నా!-' అని మహాకవిపంక చూశాను: పట్టి పగ్గాలు లేకుండా ఉన్నాడు -

కోటమ్మ మత్తుగా నవ్వి, పరధ్యానంగా నిలుచుంది; నాకు చప్పున అసలు సంగతి జ్ఞాపకం వచ్చి—

'రా, - ఇలా కూర్చో - మీ వంశవృక్షం ఒక్కసారి విదుల్చు - అయ్యవారికి కుతూహలంగా ఉంది -' అని బల వంతం చేశాను: మహాకవి కూడా అదే తాళం వేశాడు-

కోటమ్మ, పొంకంగా కూర్చుని - అభినయం పట్టే ముందు, సభను కలయజూచినట్టు, మెడ సవరించుకుని, నోరు విప్పింది -

"-కటాక్షాః వేంకటప్రభోః !-

(శ్రీ) వేంకటాద్రి ప్రభువుల కటాక్ష వీక్షణములు తమవంటి మహా - పండితులకు లక్ష్మీవిలాసములట - చిత్త గించారా బాబూ!-

ఆ ప్రభువుల ముని మనుమడు, - వారి హయాంలో ప్రేపల్లెవాడనుంచి, గోపాలకృష్ణమ్మను తెచ్చి ప్రతిష్ఠించి, - స్వామి కైంకర్యానికి, - నూరుకట్టుల మాన్యం సమర్పించు కున్నారయ్యా! -

మా ముత్తవకు తల్లి, లక్ష్మీవిలాసం, నిత్యమూ స్వామివారిని నాట్యమాడి సేవించుకుంటూండేది:

ఎన్నటో ఓనాడు, - ప్రభువువారు, నాయకురాలిని తల లూచి మెచ్చారయ్యా !-చేరదీసి, స్వామిసాక్షిగా, కొంగు బంగారమైనారు :

మహారాణీ తల్లి. - ఆ పంగుతల్లి ఈ సౌభాగ్యాన్ని సహించలేకపోయింది : ప్రభువులు ఆ తల్లి విన్నపాలు ఆలకింపరైరి.

స్వామివారి ఆలయం, శయ్యాభవనమైంది,-అపవిత్రమై పోయింది, అంటూ రాణివాసం, రాజధానిలో నీలాపనింద మోపింది : రాణువ అంతా మూర్ఛించింది, - మన్నె దొరలంపహా. ప్రభువుల ఆనతి తలదాల్చమన్నారు.

కాని, - ప్రభువులవారి మనస్సు చింతాకంతైనా చలించిందికాదు : లక్ష్మీ విలాసానికి అభయం ఇచ్చారు : ఇద్దరూ కూడి స్వామిని సేవించుకుంటున్నారు.

మహారాణి, అలుకచేసి. - పుట్టిన ఇంటికి తరలిపోయి నారు.

ఓపలేనిదని,-ప్రభువులు లాలనచేసి, నాయకురాలిని,- ఇక్కడికి రెండామడల్లో ఉన్న, మేనమామల యింటికి, పచ్చల పల్లకిలో ఫౌజును సాయమిచ్చి పంపారు.

అవి, మంచిరోజులు కావు, బాబూ !

ఎటుచూసినా దొంగమూకలు -

పిండారీలు వచ్చి పడ్డారు ! గ్రామాన్ని నామరూపాలు లేకుండా చేశారు ! ప్రజలు అంతా కొండల్లో కోనల్లోపోయి, పరువు దాచుకుంది. నమ్మినబంటే లేకపాయె ! - ప్రభువు

వారు, అందరికీ దూరమైపోయె! - ఒక్కరేం చేయగలరు? ఎల్లా అరికట్టగలరు ?

ఒరదూసిన కత్తి - ఒక్కవ్రేటుకు పదిశిరస్సులు రాల్చిందటయ్యా! - దైవం హర్షిచేటట్టు, - దేవతలు పుష్ప వర్షం కురిపించేట్టు ప్రభువువారు విక్రమించారు : అయితేనేం, ఒక్కరై పోయినారు :

ఆలయ ప్రాకారాలు, నేలమట్టమైపోయినవి : నిధి నిక్షేపాలకు ఆసపడి ఆ మూక అంత అఘాయిత్యం చేసింది : ప్రభువువారు,- ఆ సీమలోనే కొనఊపిరితో ఉన్నారు, పూచిన తంగేడల్లే !

దండువచ్చి పడ్డదన్న కబురు చూలాలుఉన్న గ్రామాన అందింది : ఈ వార్త చెవి సోకంగానే,- నాయకురాలు, సోలిపోయిందా,- లేదు,- అయినవాళ్లను వందమందిని ఆకట్టు కున్నది,- బాకూ బల్లెం అందిచ్చింది,- తానో కైజారు అందుకున్నది- ఏలే మహారాజుకు అండగావచ్చి వ్రాలింది-

అయ్యవారి స్థితి చూసింది: నాయకురాలు ఆవురు మనలేదు: అట్టే చూసింది:

ఆలయం ఉన్నచోట చూసింది : కన్ను తడి అయింది. సంబాళించుకుంది : కైజారెత్తి అయ్యవారికి మ్రొక్కింది- 'ఈ దాసికే ప్లమి ముగుదల ?' అన్నది-

అయ్యవారు, చిక్కబట్టుకున్న ఆ ఒక్క ఉసురుతోనూ,- 'లక్ష్మి ! స్వామిని దక్కించుకోలేక పోయినాము !' అన్నారు:

అయ్యావారి సరసను మోశరిలి నాయకురాలు అన్నది కందా- 'మాయామర్మమూ విడిచిన చోటు, మనసూ, మనసూ దక్కినచోటు,- ఆలయం, నాలోఉంది,- నీలోఉంది, నాయకుడా,- మన వంగసం కొలుచుకుంటుందయ్యా !-'

ప్రభువులు, రంభకు నరిసులై వేంచేశారని-, నాయకు రాలు, కోపం తాపం ఎరుగకుండా,- అక్కడే వసతి కల్పించు కుని - కన్నబిడ్డకు విద్యాబుద్ధులు నేర్పి,- అయ్యావారి పాదా లను గురుతుంచుకుని సేవించుకుంటూ అలాగే లీనమైపోయింది-

ఈనాటికీ,- సంజెదీపం వేళ,- మా కులపు సానికి,- చేయెత్తుతాము: ఆ అవ్వ ఔనన్నట్టు మెలగుతాము-

ఆనాటి మడిమాన్యాలు ఈనాటికి లేవు- మాట మాత్రం కలకాలం దక్కాలయ్యా !-"

కథ చెప్పడం అయిపోయింది : కోటమ్మ కొంచెంసేపు మౌనంగా, ధ్యానముద్రలో ఉండిపోయింది-

మహాకవి, - మరేదియూ రసికుడల్లే - నిట్టనిలువున నీరసించిపోయినాడు- కోటమ్మ తనంతట తానే తెప్పరిలి, - వచ్చినపని యేమిటో చెప్పకుండానే, - సెలవు పుచ్చుకుంది-

'ఏం మహాకవీ ? - అత్తయ్య యెంత చిక్కని వాడుక భాష వాడిందో చూశావా ;-'

జవాబు చెప్పకుండా, - మూటాముల్లే - సర్దుకుంటు న్నాడు. 'అదేం ?'- అంటే, 'వెళ్ళిపోతున్నా' నన్నాడు - 'ఏం' అంటే, - జవాబు లేదు-

'ఇంతా విని, - నెళ్లిపోవడం ఇదేం సబబు మహాకవీ,- నీకోసం కనిపెట్టుకొని ఉంటారేమో !- ఈ సీమలో అధమం మూడునిద్రలైనా చెయ్యడం ఆచారం !

మహాకవి, - కన్నుమన్నాడు -

'ఇంతావిని, - మళ్లీ అపచారం చెయ్యమంటావా !'

'చెయ్యకుండా ప్రయాణం కావద్దంటాను : ఇలాంటి కసవస్త్రైర శృంగార ప్రబంధం ఆకర్షించిన పిమ్మటకూడా దేవరవారి శీతోష్ణస్థితిలో మార్పు రాలేదంటే -'

'అదికాదు, బాబూ, ఆ యిల్లు పుణ్యక్షేత్రం - తుచ్ఛ వాంఛతో ఎలా వెళ్లగలను ?'

'గుమ్మం ఎక్కి ప్రతిసరసుమా యిలాగే బెదిరిపోయి మడిగట్టుకుంటే - వాళ్లకు దిన వెచ్చం ఎలాగడవను ?'

నే నేదో కాశీక్షేత్రంలో గోహత్యకు తలపెట్టినట్టు మహాకవి బాధ తెచ్చుకున్నాడు.

'నీ వలా అనడం-వాళ్ళను బాజారీ రూపాజీవల క్రింద కట్టడం, ఎంత పాదిత్యానికి ఒడిగట్టావురా తండ్రీ !-' అంటున్నాడు.

నేను నవ్వాను - నవ్వు ఆపుకోవడం నాతరం కాక నవ్వాను- మహా కవి,- ఇక ఒక్క నిమిషం,- అక్కడ నిలువ నన్నాడు: నా మొగం చూస్తూంటే పంచ మహాపాతకాలూ చుట్టుకుంటున్నాయి.

మనం బ్రతిమాలడం,- గడ్డం పుచ్చుకునీ, సందిట పాోల్డాల్ లాక్కునీ,- అతడు ససేమిరా ఉండనంటూ గింజు

కోపడం – ఈ సందడిలో పుణ్యకాలం కాస్తా దాటిపోయింది: కోడికూసే వేళకు కాని, మరో బండీ లేదు–

అయినా, – మహాకవి నిలిచేట్టు లేదు –

'ఇంటికి చేరుకోవాలి – విశ్వకథంతా అఖండ ఖండ కావ్యం చేయాలి – కవి కాంతకు అంకితం చెయ్యాలి – అందాకా నిద్రపట్టదు – అంతేకాదూ ?–' మహాకవి, మాట విని సించుకోనట్టు కూడుకుని, – రిక్షావాణ్ణి పిలిచి గొంజాసూ అందిచ్చాడు.

'ఒక్క సంగతి మరిచిపోయాను, మహాకవీ – ఆ కథ మొత్తం పత్రాలకీ మకవి !–'

మహాకవి – ప్రారంభించిపోయి – 'అంటే :'_ అని ఎక్కువ్వ ఇచ్చినట్టు అన్నాడు –

'అంటే – నీవు ఏ తెలుగుపత్రికా చూపెన వాపాన పోవని అర్థం !–'

మహాకవి, – నుక్క తెప్పుకుని,–

'ఇదంతా, – నీ నాటకమా ?' అని కాల్చేట్టు అన్నాడు –

'మన – ఆతిథ్యం – !– మళ్ళీ ఎప్పుడు రాక ?–'

మహాకవి, – రిక్షాలో ఎగిరికూర్చుని, – జట్కా వేగాన తోలుకుపోయినాడు.

—తీరికగా, కోటమ్మయింటికి వెళ్ళాను –•

ఎవరో వృద్ధసరసుడు, – సావడిలో కూర్చుని ఉన్నాడు, బత్తాయి తొనలు వల్చుకుతింటూ : కోటమ్మ అతి పెద్ద

ముత్తైదువల్లే, – ఎడంగా నిలుచుని, – అధ్యాత్మరామాయణం వేమనపద్యాలూ రంగరించి, – వేదాంతం మాట్లాడుతూంది–

నన్ను చూడగానే ముసలి రసికుడు ఉలిక్కిపడ్డాడు : కోటమ్మ నిదానంగా, – అతి ఆప్యాయనంగా దయచేయమంది : 'అయ్యవారే, – అమ్మాయిని చేరదీసింది – మాకు మహారాజపోషణ : ఉదయమే, స్వగ్రామంనుంచి దయచేశారు –' అంటూ ఆ పెద్దమనిషికి చేయెత్తి దణ్ణంపెట్టింది –

'మా గురుపుత్రులు –' అంటూ నన్ను చూపించింది. 'బాబూ !– కాఫీ పుచ్చుకోరూ ?'– అన్నది. నేను అక్కర్లేదన్నాను. ఇంతలో, – కనకం వచ్చింది – రసికుడు, – బెరుకు బెరుకుగా చూసి, – ఊరుకున్నాడు –

'ఏం మహాకవీ !' అని పలుకరించాను; కనకం ఫక్కున నవ్వింది – కులకబోయి, – అట్టె సంబాళించుకుంది –

అదేమిటి ? – అన్నట్టు కోటమ్మవంక చూశాడు, – ఆ మారాజు –

'దుర్గమ్మకు అదో ముద్దుపేరు బాబూ – అబ్బాయిగారు, – ఈ యీడునుంచీ పిల్ల దాన్ని ఎరుగున్నారు–' అని,– ఏ రెండుమూడేళ్ల ప్రాయపు ఎత్తో అభినయించి చూపించి, – కోటమ్మ సర్ది చెప్పింది – నన్ను సాగనంపడానికి, – గుమ్మందాకా వచ్చింది :

తృణమో పణమో ముట్టచెప్పాను : తృప్తిగా పుచ్చుకుంది – మహాకవి మాట తలచుకుని, – ఆయన గోణగోణ

తలచుకుని, నవ్వింది – 'ఆ కబుర్లు కామరాజు ఎక్కడ దొరికాడు మనకు బాబూ!' అంది.

'ఆయన మహాకవి! – అలాంటివాళ్లు సాధారణంగా ఏ కొంపైనా పాదధూళితో పవిత్రం చేస్తారు కాని. – పక్కధ్వంసం చెయ్యరు – మనం అంటావా, – ఏదో యీ రూపేణ కొంత సాహిత్యసేవ చేస్తున్నాం – అంతే!–'

కోటమ్మ పలు విప్పకుండా నవ్వింది – నేను పుట్టక ముందు,–మా పెద్ద మేనమామ వంక చూపినట్టు–చూసింది –

ఇంటికి వచ్చి పడుకున్నాను – తెల్లవార్లూ మహాకవి విశ్రమించిన మేరంతా, ఎలుకలు అతివిరహంగా కిచకిచలాడుతున్నాయి –

# చివురు - వెన్నెల

సకల కళాపారంగతులు, సర్వలోక రక్షకులు, శౌర్య ధనులు అయిన దొడ్డ దేవరాయలవారు, ముత్యాలశాలలో, పండిత గాయక బృందము బలసి కొలువై ఉన్నతరుణాన, వెలనాటి గరుడపక్షి, ఒక్కనాడు ఎగిరి ప్రదక్షిణంగా రాగలిగినంత సీమను పరిపాలించుతూన్న గండు కాటమ నాయకుడు, 'మీ కన్నెను, మా కోడలినిగా చేసుకుంటా'మని, కులగురువుల చేత వర్తమానం చేయగా- రాయలవారు ఆ వియ్యము తమకు సమ్మతమే కనుక, కన్నె మనసు తెలుసుకునేందుకు, చిరంజీవి చిక్క విరుపాజి, ఎండ కన్నె తెరవని నీడను, ఏకాంతవాసంగా, కళకో చెలిమికత్తెగా, అరవైనాలుగు నెచ్చెలులతో నెచ్చెలికి పదుగురేసి ఊడిగపు పడతులతో, నిత్య వినోదవైభవాలతో ప్రాయపుపొద్దులు గడుపుతూ ఉన్న

కుంజవనికి దయచేసినవాడై, వెన్నెల నానబెట్టిన మంచు చినుకల్లే పూరేకలు, మలచిన పుష్పాడి పుణికిస్తే చాముండేశ్వరి ముక్కెర రవతళుకల్లే, మరుల ఒకులున్న మహాశ్వేతల్లే, తామరవెల్ల తనువు కచ్చిన శారదల్లే, పాలకడలి కడుపు పొంగల్లే, చంద్రకాంత వీధుల్లో - విరిసిన పూవుల్లో పూవుగా కలసిమెలసి నడయాడుతున్న కన్నె-కుమారిని తిలకించిన వారై-వైన మీ తీరమ్మా అని ఎరుగజెప్పి-ఏమమ్మా నను కన్న తల్లీ ! నీ ముచ్చట లేమమ్మా ! అని పలుకరించగా-

ఆ అపరంజి తీవె-కిన్నెర మీటుగా ఉలిక్కి-పడి-తొంగలి రెప్పలు మూనంగా, సిగలో గొజ్జంగి చేత నందుకున్నదై, తండ్రి వంక చూసి, చిరునవ్వులో సిగ్గుపడి-చెలుల సందిట జేరి, శిరస్సుతో ఔను-కాదని-అందని సమాధానం ఇచ్చింది.

రాయలవారు ముత్యాలశాలకు తిరిగివేంచేసినవారై, కాటమనాయకుడి కులగురువులను ఘనంగా సత్కరించి, మా అభిమతం అనుకైనంత వేగిరం వర్తమానం చేయగల వారమని విన్నవించుకుని, వారి ఆశీస్సులందుకుని, సాగనంపిన వారైనారు.

ఆపై, నెలప్రొద్దులు గడచినవి.

గోరువెచ్చని చలి.

కన్నెలందరు కాత్యాయనీ వ్రతం పట్టే పండుగ రోజులు. రాయలవారు, ఒక కన్నెను కుంజవనినుంచి సముఖానికి రప్పించుకుని, చిరంజీవి మనసేమో తెలియజెప్పమన్నారు.

ఆ ప్రౌఢ అంజలించి పలుకరించినప్పుడల్లా చిన్నది చిరునవ్వు నవ్వుతూన్నదయా! కామిత మేమమ్మా అన్నపుడల్లా కనులర మోడ్చి, లీలా కమలంతో మమ్మల్ని కోమలంగా మందలించుతూన్నదయ్యా! కలకాలమూ కన్నెతనమే నీకు ముచ్చటా, ఐదువరాలివి కావా? అని కసురుకోగా, చివురుల వంటి మునివేళ్ళతో, చెక్కిలి పుణికి హంసనడకలు నడుస్తూన్నదయ్యా! కన్నె మనసేమో మాకు తెలియరాలేదు! ఏమమ్మా తెలియజెప్పవమ్మా అని అందరమూ కలసి కవ్వించగా – కన్నె లేడిని తరిమి పట్టుకుని – కలకల నవ్విందయ్యా! – అని మనవిచేసుకోగా –

రాయలవారు కన్నె తీరుతీయములన్నీ విశదంగా, కాటమనాయకుడికి కమ్మ వ్రాయించినవారైనారు.

"మా చిరంజీవి, కమ్మను కనుల కద్దుకుని, మా ముకుదల అందుకుని, ఎటకో పయనమై పోయినాడు, ఏదో దివ్య క్షేత్రానికట" అని – జాబుకు జవాబు వచ్చినది. రాయలవారు చిన్నబుచ్చుకున్నారు.

సంక్రాంతి తరలిపోయి – పోయి పోయి – సంవత్సరాది చేరువౌతూండగా – కుంజవనిలో – కన్నెలందరితోనూ కలసి, చిక్కవిరుపాజి – కామదేవ ఆరాధనకు – పూలసంభరాలు సమకూర్చుకునే తొలిపొద్దున మాధవీ మంటపము చెంగట ఎలమావినీడను పద్మాసనంతో, చిన్ముద్రతో, సౌభరికి అపరావతారమైన ఒక తేజోమూర్తి, బవిరిగడ్డంతో వెన్నెల రాపాడే జటాజూటంతో బంగరు విగ్రహంగా పొడకట్టగా –

విరుపాజి అప్రయత్నంగా సమస్కరించి - అంతలో దిటవు తెచ్చుకుని - కనుసన్నలో చెలులను హెచ్చరించగా - నెచ్చెలులు ఆరెకులను పిలువనంపగా - ఆ తాపసికి ధ్యాన భంగమైనది.

అంతఃపురోద్యానం పురుషులు ప్రవేశింపరాదని ఎరుగడా ? -

ఎరుగడు. ప్రశాంత రమణీయ ప్రదేశాలన్నీ అందరికీ అనుభవ యోగ్యములే కదా !

లేడి కూనలకు లేని కట్టడులు, మానవుల కెందుకూ?- మహారాజులు మతిమంతులు కారా? తాపసి పలుకులకు విరుపాజి ఉలికిపడినది. ఆరెకులను మరలిపొమ్మని - ఆత డిని సాగనంపమని, నెచ్చెలులకు ఆదేశించింది. ఒక్క గడియ ఉండనీయమన్నాడు. కావలసిన పూవులన్నీ తెప్పించుకుని - పోసిన రాసులన్నీ - గడియలో, కామదేవ మూర్తిగా - తన రూపున చిత్రించి - రాకుమారికి - దీవెనగా దయచేసి - అక్కడ నిలువకుండా తరలిపోయినాడు.

ఆ చిత్రశోభకు కన్నెలందరూ - నివ్వెర పోయినారు. అలనాటి అర్జునుడు కాడుగద! అనుకున్నారు. విరుపాజి గంభీర మౌనముద్ర వహించింది.

రాయలవారు ముత్యాలశాలలో కొలువైవుండగా - ఈ తాపసి, అచ్చటికి దయచేసి - సమ్మానితుడై - దేవర అభీష్టమేమని- రాయలవారు మనవిగా ప్రశ్నించగా- మానెడు మల్లెలు, కుంచెడు జాజులు, రాసెడు మందారలు, అర

యోజనం తామరతూడులు, వేయిన్నొకటి తామరపూవులు, నిలివెడు పుష్పాడీ-నిండు కలశంతో జంటితేనె ఒనగూర్చితే - దేవర అభీష్టమూ, తన అభీష్టమూ సిద్ధించునని తాపసి సెల వీయగా -

రాయలవారు - వారు కోరిన దినుసులన్నీ ఒక్క-ముహూర్తంలో సమకూర్చగా - తాపసి ఆ తావున ఏడు గడియలు ఏకాంతంగా ఉండవలెనని, అభిలషించగా, - రాయలవారు తపసి కోరిక శిరసావహించినవారై - అభ్యంతర మందిరానికి వేంచేసి, దేవబ్రాహ్మణ పూజలు ముగించుకుని - బంగారు పళ్లెరంలో - కళసాపురంనుంచి అప్పుడే వచ్చిన, కదళీ ద్రాక్షలూ, ఆరకాచిన గోక్షీరమూ ఉంచుకున్న వారై - తిరుగ ముత్యాలశాలకు విచ్చేయగా —

అక్కడి స్థితి ఏమిటి ?

పూలరాసులూ పుష్పాడి మాయమైనవి !

అక్కడ మరి - ఏమున్నదయ్యా ! -

అరవై అయిదు పూల తేరులు ! -

తేరుకో పుష్పాడితో మలచిన కన్నె -

కన్నెకో వెల్లతామర గొడుగు -

తొలి తేరుకు, రెండు ఛత్రాలు.

ఒక్క- ఛత్రం క్రింద - చిక్క-విరుపాజిమూర్తి - ఆ పరసను ఛత్రం నీడను - మీ విరుపాజికి వరుడయే ధన్య మూర్తి నిలవాలి, మహారాజా ! అన్నాడు తాపసి. కన్నెకు కబురంపవయ్యా ! అన్నాడు.

చిక్క విరుపాజి, ఈ చోద్యం చూడటానికి – మన్మథుడి పట్టు-వదలిన శరవేగంతో అక్కడకు వచ్చి, ఓ కంటను ఆ చిత్రం చూసి – ఓ కంటను దీక్షగా తపసిని చూసి తండ్రిని చూసి తల ఊచి. ఒక్క గడియ గడువిస్తే – వారు కోరినది, కనుల కట్టేట్టు చేస్తానని మనవిచేసి – గడియలో కుంజవనిలో, దర్శనం యిప్పించమన్నది.

మరో గడియకు, రాయలవారూ, తపసీ కుంజవనికి దయచేయగా – అక్కడ –

తనకు మొక్కుతూన్న తపసీ – తన కౌగిలిలో ఉన్న తరుణుడూ – ఆ మూర్తులను, జాజుల తెర తొలగించి – తిలకించమని మనవిచేసింది విరుపాజి.

తపసికి తన కన్నె అపచారం చేసిందని, రాయలవారు ఉగ్రులైనారు. తపసి పాదాలంటబోయినారు. కన్నె – యీ కలవరపాటు చూసి – కలకలలాడింది. తపసి, మెప్పుగా తల ఊగించినాడు. పుష్పమూర్తికి అమరించిన జాజుల బవిరిగడ్డము సడలించినాడు. తపసీ – తరుణుడూ ఒక్కరే!

తా మెవరు స్వామీ! – అన్నాడు రాయలవారు అర్థం చేసుకుంటూ –

కాబోయే అల్లుణ్ణి కద! అన్నాడు తపసి –

కాటమనాయకుడి కుమారుడికి కన్నె నివ్వాలని నిశ్చ యించు కుంటేనే - అనుకున్నాడు – రాయలవారు. ఆ సంగతి మనవిచేసి–సర్వసంగపరిత్యాగులు – కామినీ వ్యామోహంలో పడటం సమంజసము కాదేమో – అన్నాడు.

కన్నె లభించకపోతే - సన్యాసినేకదా ప్రభూ ! మీ కుమారి కాటమనాయకుడి కోడలే - ఆమె నేర్చిన విద్యలే నేనూ నేర్చానని మనవి చేయడానికీ, మనసీయడానికీ - ఇంత దూరం తరలివచ్చానయ్యా ! వచ్చింది, మీ సిరులూ సంపదలూ చూసి కాదయ్యా ! ఆ కన్నె చిరునవ్వుకోసమయ్యా - అని మనవి చేసుకోగా - రాయలవారు బ్రహ్మానందభరితులై - మంచి ముహూర్తాన చిక్కవిరుపాజిని, చిరంజీవి శౌరినాయకుడికి కన్యాదానం చేసినవారైనారు.

ఆనాడు శౌరినాయకుడు - పూవులతో కల్పించిన మూర్తులు-మరునాటికే వసివాడిపోయినవా? - లేదు - తేనె, పుష్పాడి - గోరోజనం - కస్తూరి - గైరికమూ - సాంబ్రాణి - పాలతో గలిపి పూతపూయగా. చెక్కుచెదరక-రేకు రేకుగా-అప్పుడే విరిసిన పరిమళం నిలుపుకుంటూ - ఎన్ని సంవత్సరాలో, అలా ఉండిపోయినవయ్యా ! చివరకు ఒక దుర్ముహూర్తాన - తురుష్కులు ఆ దివ్యకల్పనను ధ్వంసం చేశారయ్యా!-

కాని, ఈనాటికీ కన్నడ కన్నెలు పూవులతో మలచినట్టు సుకుమార కోమలాంగులుగా ఉండటం - కన్నెలకు పూవులంటె తగని మమత, అలనాడు చిక్క విరుపాజి చేసుకున్న పుణ్యమేనయ్యా !

# చైత్రరథం

నాగరత్నం, ఇదివరలో, ఒక్కసారికాదు, పెక్కుమారులు తన అకుంఠిత దేశభక్తినీ, ఖద్దరుమీద తనకున్న విశ్వాసాన్నీ, అహింసా సూత్రాల సుష్టు సమన్వయంలో కలిగిన ఆనందాన్నీ — యథాశక్తి ప్రకటించింది.

ఆ రోజుల్లో ఆ గంభీర శంఖారవము చెవి సోకీసోకడంతోనే — అప్పటికి అయిదారు మాసాల ముచ్చటే అయినా, ఆ సీమకల్లా కుబేరుడులాటి ఆసామీ సరికొత్త పోషణలోంచి, తనమీదా, తన సంపాదనమీదా సకల — ఆశలూ పెట్టుకున్న ముసిలిదాని శాపనార్థాల్లోంచి,—వాడకట్టు అంత్రా ముక్కుమీద వేసుకున్న వేలిమీదనుంచి, — లక్షణమైన పట్టుపరుపు మీద నుంచి, అమాంతం ఒకే అంగలో లవణసత్యాగ్రహంలోకి

దూకింది: అందరితోబాటు, మక్కెలువిరిగేట్టు తన్నులుతిన్నది: జైల్లోపడ్డది: అర్ధరాత్రివేళ, అధికారం వున్న మీసాల రాయుడు, సొంతసొమ్ములాగా చొరవచేసి మీద చెయ్యి నెయ్యగానే, - కండలు ప్రెళ్ళిపడేట్టు కరిచింది: ప్రభుత్వ శాఖను గాయపరిచిన అదనపు నేరానికి, - శిక్షకు మరికొంత కొసరు వేయించుకుంది. ఒక్కపైసా సంపాదన లేకుండా, - ఒంటరిగా అన్ని మాసాలూ ఖైదులో చెక్కుచెదరకుండా నెళ్ళబుచ్చి, మల్లెపువ్వల్లే బయటపడ్డది:

ఖద్దరు కట్టింది. ఖద్దరు అమ్మింది: నిప్పులు చేరిగే ఎండల్లో రెక్కలు పడిపోయేట్టు ఆ తానులన్నీ వేసుకుని యింటింటికీ తిరిగి కొనమని బ్రతిమాలుకుంది: ఇంటి ఇల్లాలుకి, యీ బజారు మనిషితో మాట్లాడటమే నామోషీ అయి, చూసి చూడగానే మొగాన కొట్టినట్టు తలుపు ఫెళ్ళున వేసుకున్నా, మనసులో అయినా తిట్టుకోకుండా ఆ గుమ్మం దిగి మరో గుమ్మం ఎక్కింది. దోవనుపోయే ఎద్దుల్లాంటి బడి ఎగ వేసిన పిల్లకాయలు అతి చులకన కూతలు విసిరితే, - చెంప పగిలేట్టు మందలించకుండా, - వినిపించుకోనట్టు, వాళ్ళవంక చెల్లెలిలాగానో అక్కలాగానో చూసి అడుగు ముందుకు వేసింది:

అంటరాని దానికన్న, కినా - కష్టంగా, కట్టినా, అందరినీ సహించుక్కుంది:

కాంగ్రెస్ సభలు జరుగుతూంటే, ఆ ఊరు పనివేళా భక్తి తాత్పర్యాలతో వెళ్లింది. ఆ సవాకోటి లింగాల్లోనూ-

స్వగ్రామం నుంచి వేంచేసిన ప్రతినిధులు, కాకిని పొడిచినట్టు పొడిచినా, - 'పోనీలెద్దూ ఎక్కడికి వచ్చినా, ఏ బురఖా వేసినా వీళ్ల నైజం యింతే !' అన్నట్టు ఊరుకుంది.

'భరతమాత ఏ తరంలో అయినా వీరసంతతినే ప్రసవించింది: ఆ తల్లి కడుపున పుట్టిన ప్రతి - ప్రాణి, - అతిరథులు మహారథులు, - దాస్యానికి తలఒగ్గని వీరాధివీరులు-' ఇత్యాది ఉద్ఘాటనలు నిజమే అన్నంత ఆప్యాయంగా విన్నది. కాంగ్రెస్ నగరం అంతా, - స్వాతంత్ర్య సమరానికి సన్నద్ధంగా ఉన్న భారత వీరస్కంధావార మనుకుంది: దయచేసిన పెద్దల్లో కొందరిని, అల్లంత దూరాన్నుంచి చూసింది: ఆ రణగొణ ధ్వనిలో, విన్నంత విన్నది :

దేశంతో బాటు - అనామకంగా ఎండ బారిపోయింది: అన్ని ఏళ్లూ అలాగే గడిపింది : తాను పుట్టిన పుటకా బ్రతికిన బ్రతుకూ తలచుకుని బాధపడకుండా, అసిధారగా-

అన్నేళ్ళూ గడవగా - గడవగా -,

దేశం క్రమంగా మారిపోయింది : పరిస్థితుల్లో పెద్ద మార్పంటూ ఏం రాకపోయినా, - పెద్ద ఫాయాల్లో మనుష్యుల అంతస్థూ చూపూ, ఊహాకు అందనంతగా మారిపోయింది : దైవం తిన్నగా చూపి, - దేశం ఓ గట్టున పడటం అంటూ వస్తే - కట్టుకోబోయే పట్టాలకోసం, ఎక్కబోయే ఏనుగంబారీలకోసం, - మోయబోయే పూలదండలకోసం, - ఆగామి నాయకులు వాటాలు తేగక, - కుడీ ఎడమ పాయ

లుగా చీలి, - మానసికంగా, అతి శాంతియుతంగా ముష్టి యుద్ధం ప్రారంభించారు: దీనినే, అభిమానులు జాతీయ చైతన్య విజృంభణమనీ, - గిట్టనివాళ్లు మరేదో - మరేదో అనీ అన్నారని, - ఆ రోజుల్లో పత్రికలు చదవడం అలవాటు చేసుకున్నవాళ్ళకు, యీనాటివరకూ జ్ఞాపకం ఉంది:

అలా, గోవులూ - గోవులూ కుమ్ములాడుకుంటూంటే, అడ్డం వెళ్లకపోయినా, అనేక శతసహస్ర - లేగల కాళ్లు విరిగినాయ్ - కొన్ని శాస్త్రీలే - నామరూపాలు లేకుండా పునాదుల్లోకి కూరుకుపోయినాయి:

నాగరత్నం,- యీ తాకిడికి యీవత్తూ ఎలా తట్టుకుందో, - ఎలా బ్రతికిందో,- ఎవరూ అజ కనుక్కోలేదు - ఆగస్టుపండుగల కోలాహలందాకా, - ఆ జీవితచరిత్ర అంధయుగం:

ఆ నిశి-రాత్రివేళ,- సర్వప్రపంచం నిద్రాణమై ఉన్నప్పుడు భారతదేశం - జాతి, - స్వాతంత్ర్యంలోకి మేల్కొన్నదని, - ఇలాంటి అర్థం యిచ్చే మహావాక్యాన్ని రేడియో ప్రసారం చేసింది: అందుకోసం మేలుకు కూర్చున్నవాళ్లందరూ విన్నారు.

నాగరత్నం కూడా విన్నది - విని నవ్వింది-

'ఏం బడాయిలు పోతున్నాడో చూడండి! - అందరూ నిద్రపోతూంటే మనం మేలుకున్నామట - చిన్నప్పుడు భూగోళం క్లాసుకు వెళ్ళినట్టులేదు!-'

ఎదురుగుండా కుర్చీలో అంతసేపటినుంచీ విసుగ్గా కూర్చున్న పెద్దమనిషి - తలుపు గడియ వేసినట్టు రేడియో మూసివేసి - ఎగిరి తన్నినట్టు దీపం ఆర్పేశాడు.

'ఏమిటీ ఆగడం ! - మనం గృహస్థులం కాముగా !-' అని నాగరత్నం చిమ్మచీకటిలో నవ్వుతూ గదమాయించింది- ఆ పెద్దమనిషి కొరకొరలాడాడు, దగ్గిరగా -

ఊళ్ళూ, వాడలూ - రాజధానీ నగరాలూ, తెల్ల వాళ్లూ సత్తువమేరకు కోలాహలం చేసి, - కోడికూసిన తరు వాత ఒక్క నిద్దుర తీసినవి :

నాగరత్నం బద్ధకంలేకుండా, తెల తెలవారుతూండగా లేచింది. భళ్లున తెల్ల వారిన తరువాత ఆ పెద్దమనిషిని లేపింది- మర్యాదగా సాగనంపుదా మనుకుంది :

అవతలమనిషి, - ఎన్నడూ లేని ఘరానాకుపోయి, - ఫన్ను ఝుళిపించి, - కొంత ముట్టచెప్పబోయినాడు : చెయి సాచాడో లేదో, - వెను వెంటనే చెంప ఛెళ్ మన్నది : నాగరత్నం వరదూసిన కత్తి అయిపోయింది :

'సాక్షి సత్యాగ్రహి కదా అని, - కలసి ఆదమరచాను: సానితనమే అయితే,-నీవంటివాజె మరోజన్మ ఎత్తాల్సిందే!-' అని మొగంమీద అనేసింది :

అవతల పెద్దమనిషికి ఎన్నడూ ఈపాటి తలవంపు లైనట్టులేదు. బ్రిటిషు ప్రభుత్వమైనా, - ఏదో తూటపట్టింపు కొద్దీ మొండికి వేసినప్పుడు చేయి చేసుకుంది. కాని, ఇంత పరాభవం చేయలేదు - ఏదోపోనీ పాపంకదా అని జాలి

దలచి, కష్టం ఉంచుకోవడం ఎందుకని మంచికిబోతే – ఇలా అయింది !–

బాజారీమనిషీ – నలుగురిలో తిరగవలసిన పెద్ద మనిషి, – ఆస్థానంలో రగడ పెంచుకుంటాడా ? – పళ్లు కొరుక్కుంటూ చక్కా బోయినాడు : ఎలాగైనా దాన్ని హత మార్చితీరాలని హఠం వేశాడు !–

ఉన్నట్టుండి ఓనాడు నాగరత్నంమీద అభాండం విరుచుకుపడ్డది : నలుగురు పెద్దలూ ఒక్కచోట సమావేశమై నాగరత్నానికి కబురుచేసి నిలుచున్నపళాన రప్పించి, తర్జన భర్జన చేశారు – కాండ యావత్తూ ఇన్నివందల ఏళ్లనుంచీ అలవాటైన పంపిణీమీాదనే – కోర్టు పద్ధతిలోనే నడిచింది :

'నీ పేరు?'

'నాగరత్నం; ఇంటిపేరు – సింగారం, తల్లి పేరు – చిన్న భూషమ్మ అనే వ్యవహారనామం కల భువనమోహనాంగి – తండ్రిపేరు – పేరూ ఊరూ మా అమ్మను అడుగ లేదు–కలం–లేదు :

'పెళ్లి అయిందా ?'

'కాలేదు – కాదు !'

'జీవనోపాధి–?'

'మడిమాన్యాలు!'

వృత్తి – దేశసేవ !'

'అంటే–?'

'దీనికి నానార్థా లుంటాయా స్వామీ !–మనం యథా శక్తి చేస్తున్న దే !'

ఇందులో ఏదో ఎత్తిపొడుపు ఉన్నదనుకుని, పెద్దల చతుష్టయంలో ఒకాయన – 'ఒళ్లు దగ్గిర పెట్టుకుని మాట్లాడటం మంచిది!–' అని తుమ్మినట్టు అన్నాడు:

'ఎవరిఒళ్లు గాబూ!' అని నాగరత్నం ఏదో మనవి చేసుకుంటున్నట్టు అడిగింది :

అందరికీ నవ్వు వచ్చింది కాని ఎవడో ఒక్కడే మాత్రం నవ్వాడు – మరో పెద్దమనిషి, ఛార్జిషీటు చదివినట్టు ఏకబిగివిన అసలు సంగ తేమిటో అడిగేశాడు :

'నీ పడకగదిలో దేశనాయకులందరి పటాలు వ్రేలాడ గట్టావట నిజమేనా ?–'

'అవును !–'

'తప్పుకాదూ ?'

'అదేమి బాబూ!'

'ఆ పవిత్రమూర్తులకు అదా నీవిచ్చే స్థానం ? నీ పాపపు బ్రతుక్కు వారందరూ కర్మసాక్షులా ?–'

'అయితే మాత్రం, వారి యశస్సుకు కళంకమా బాబూ !– యేసునాథుడు సిలువ మోసినట్టు ఎవరికి వారు లోకంలో బరువు పంచుకున్న వారేగా – ఎదుటి యాతనలన్నీ చూస్తూ, నీ రింకిపోయి కాయలు కాచిన ఆ కళ్ళకు, – కడుపుకు కొరమాలిన తోబుట్టువు, తన కనీసవువాక్కు అమలు చేయడం – రోతగా కనబడుతుందా ?–

నిగ్రహం అనుగ్రహం ఉన్న సంసారులకు, బ్రహ్మచర్యం చేయడం అంటే, – సత్యాగ్రహోద్యమంలో అదో ముచ్చటవేసే ఘట్టంగా తోచచ్చు: అలాటి బలవంతపు ఆట విడుపు వేడుక కావచ్చు – నావంటి – అదే అమ్మకు బ్రతికే జీవికి – ఆ వ్రతం ప్రాణాంతకం కాదా బాబూ –?

అయినా, – ఇలాగే యిన్నాళ్ళూ నెగ్గుకువచ్చాను: నా చేతనైన ఉడుతాభక్తి దేశానికి చేశాను: పెద్దలందరూ దేశంతోబాటు తరించే సన్నాహంలో ఉన్నారు: మావంటి అనామకులం ఎందరమో పునాదుల్లో పడిపోయినాం– నాలాటి మొండి ఘటాలు ఒకటో, అరో, – మళ్ళీ ఎప్పటి ఆటె ఆడుతున్నాం !–'

'ఇదంతా అనవసర ప్రసంగం! అడిగినదానికి సమాధానం చెప్పు !–'

అన్నీ తెలిసినవారు – ఇంతకన్న వినరంగా ఏం చెప్పకోను? – తమ రందరు నేను చేసిన పని తప్పు అని సెలవిచ్చారు: అది, – భక్తి అని మనవిచేసుకుంటున్నాను! నాతోబాటు తెల్లవారి మేలుకునే సరసుడికి – కన్ను విప్పగానే ఆ మహామహుల దర్శనం అవుతుంది: చీకటి తప్పుచేశానేమో,–సుఖం కొనుక్కున్నానేమో అనే సంకోచం పోతుంది: ముట్టచెప్పే కాసో వీసమో... ఆ మూర్తుల సాన్నిధ్యంలోనే పుచ్చుకుంటాను: అందులో సగపాలు నా పోషణకు ఉంచుకుని, మిగిలిన సొమ్ము నెలకోసారి,– ఏ నిధికో పంపుతున్నాను: ఇవి చీకటిబజారు లాభాలే

కానీఁడి: దేశంలో కొందరు పెద్దల అడుగుజాడల్లో,- నేనూ కొంత సంపాదన సద్వినియోగం చేస్తున్నాను!-'

వింటూన్న పెద్దల సదస్సు,- ఒక్కుమ్మడిగా హుంకరించింది! వాళ్ళల్లో వాళ్ళు ఏవో చాటుగా గుసగుసలు పోయి, - అప్పటికి నాగరత్నాన్ని పంపివేశారు:

పెద్దలందరూ, ఎవరికివారు, ఒంటరిగా నాగరత్నానికి నీతిగరపాలనే సదుద్దేశంతో, - ప్రగల్భంగా, బాహాటంగా ఆ యింటి చాయలకు సంజెవేళ బయలుదేరిపోయి, - పట్టు బలవంతంమీాద ఆ పూటకు అక్కడే నిలిచిపోయి, - వేకువ జామున యింటికి మరో సరుడికంట పడకుండా - మళ్లుతూ వచ్చారు:

అపమార్గాన పడిపోయిన వ్యక్తిని, - అందులోనూ, స్వతంత్రంగా బ్రతుకనేర్చి సత్యాగ్రహతత్వం జీర్ణించిపోయిన శతమొండిని, మనసుమార్చి, సజావైన త్రోవకు మళ్లించాలంటే - ఒక్కరాత్రితో, అంత తేలిగ్గా అయేపనా?,- అభిమానించిన పెద్దలందరూ, రోజులూ, మాసాలు విడువకుండా కృషిచేశారు:

క్రమంగా, పెద్దల నయవర్తన కొందరు పిన్నలకు కూడా అబ్బటం ప్రారంభించింది: నాగరత్నం, - పోనీ పాపం కదా అంటూ కొంతకాలం ఓపికపట్టి చూసి, - చివరకు, ఈ పెద్దల నందరినీ సాక్ష్యులుగా ఉదహరించి, - తాను రాజకీయ బాధితురాలను గనుక, - పడిన శ్రమను ప్రభుత్వం గమనించి ఉచితరీతిని ఆదరించవలెనని అర్జీ దాఖలు చేసుకుంది.

స్వయంగా వెళ్ళి ఆ శాఖకు సంబంధించిన అమాత్యుడి దర్శనంచేసి, వివరములు యావత్తూ విన్నవించుకుంది - అమాత్యుడు ఏమన్నాడో తెలియదు కాని, - ఇనుకటి పెద్ద లందరూ, - ఏకగ్రీవంగా 'నాగరత్నం మా కొంప తీసింది-' అని గుసగుసగా వాపోయినారు ! - ఇంటికి వెళ్ళి - ఇది నీకు న్యాయమేనా ? - మా బ్రతుకులు ఇలా చేస్తావా ? అని తిడుతూన్నంత అక్కసుతో బ్రతిమాలుకున్నారు:

అందుకు, నాగరత్నం, అన్నిరకాల చనవులూ కలిపి వచ్చేట్టు, - అందరికీ నాటుకునేట్టు, విరగబడి నవ్వుతూన్నంత అట్టహాసంతో - మందహాసం చేసింది - 'మనమంతా ఒక టేగా,-నన్నింత బ్రతిమాలాలా ? - నిశ్చింతగా వెళ్ళిరండి-' అన్నది.

అంటే మటుకు, _ తగిలినదెబ్బ ఎక్కడికి పోతుంది -?

ఓడిపోవడం అనేది ఒంటపట్టి పోయినవాళ్లందరూ 'దానికేంలే !' అన్నట్టు చిన్న వెకిలినవ్వు నవ్వి - గుండెదడ సంబాళించుకున్నారు ! - వాళ్ళలో పైత్యప్రకోపం వున్న ఓ చిన్నపారు పెద్దమనిషి మాత్రం, - 'ఇంతటితో నిన్ను వదిలామనుకున్నావా,- వ్యభిచార నిర్మూలన చట్టంక్రింద కేసు పెట్టించి నీపుతం ఆర్చకపోతే - నా పేరు మారుపేరు పెట్టు-' అని ఉగ్రంగాలేచాడు: తోటివారందరూ, - మన మనస్సులో ఉన్న కార్యక్రమం ఈ వెకిలివాడు వెళ్లగక్కేశా డేమా అని, నాలుకలు కరచుకున్నారు-

నాగరత్నం, మరింత నిదానంగా నవ్వింది - 'అయితే ఎవరికి నష్టం ?-' అంది :

'ఏం - అదేమిటి ?'

'ఏమీ లేదు - చట్టం సరిగా అమలులోకివస్తే - నిర్మూలం అయేదీ మీరందరేకదా అని విచారంగా ఉంది !-'

నాగరత్నం విచారానికి కీలకం ఎవరికీ బోధపడలేదు :

'అర్థం అయినట్టు లేదే - మీవంటి ఘరానా మనుష్యులు, కనుచాటుగా ఆత్మనంచనగా, చేసే ఆరగింపు - వ్యభిచారం !- నా కిది, ఉద్యోగం - నా జీవిత పునర్నిర్మాణ కార్యక్రమం ! - ఒకవేళ శిక్షపడితే - మీవంటివాళ్లకు గట్టిగా బుద్ధిచెప్పలేని నా మంచితనానికే, శిక్షపడవచ్చును : అందాకా ముదరనీయడం మనకూ మంచిదికాదు- మన దేశానికీ మంచిది కాదు-'

చెప్పేహితం వినేందుకు, ఆ చాయల్లో ఒక్క-పిట్టలేదు: నాగరత్నం విసుగ్గా కుర్చీలో కూలబడి - 'ఎందు కిలా ముత్యాలు వెదజల్లడం-' అనుకుంది : ఆ క్షణంనుంచీ, - మొగమాటంలోంచి, తొలినాటి వైభవంలోకి ఒత్తిగిలింది -

# మేనక

ఊళ్ళో వాళ్ళందరూ, ఇది ఖచితంగా పిచ్చే అన్నారు:

తల్లి మాత్రం మొర్రో దానికి పిచ్చి కాదంటుంది. దాని, వేసీ వేయనితనం చూసి ఓర్వలేని నాపసానులందరూ చేరి, - ఏదో చేయించారు అని మొత్తుకుంటుంది :

పిచ్చో, - వెర్రో - ప్రయోగమో - మెట్టుకు, ఏదో ఒకటి !-

కాకపోతే, - మాంచి పిటపిటలాడే వయసులో ఉండి,- అటు పదిగ్రామాలకూ యిటు పది మొఖాసాలకూ వ్రేలు మడిచి చెప్పదగ్గ సాని ఎవరబ్బా అంటే అమ్మడే! అనిపించుకుంటూ మూడు పువ్వులూ ఆరు కాయలుగా, - కాలుదీసి

క్రిందపెట్టక్కర్లేకుండా హాయిగా, – అయిన మారాజు చేరికలో సుఖంగా ఉన్న అమ్మడికి – ఇదేంబుద్ధి ?

నిన్న రాత్రి. – కోడికూసేవరకూ సరసుణ్ణి సుఖపెట్టిన చిన్నది – తెల్లవారేసరికి ఇలా అయిందేం ! – ఏమీ కారణం లేకుండా నానిపాక, – ఆ పనికి దణ్ణంపెట్టేసిందేం ?–

ఏమో ఎంతమంది కదలేసినా ఊఁ అనలేదు – ఆఁ అనలేదు ! కొనిపెంచిన తల్లి శోషవచ్చేట్టు వాపోయినా లెక్కచేయలేదు ! ఇంతకాలంగా తనయింట పిల్లిలాగా మెలగుతున్న సరసుడు, పడిగాపులుగా పస్తుపడిఉన్నా ఖాతర్ చెయ్యలేదు ! 'నేను ఇవాళనుంచి ఈ వృత్తి మానేస్తున్నాను!–, అన్నది!– మానేసింది! –

౨

అమ్మడూవాళ్ల వీధిచివరను !ఓ పండువంటి తాతగారు ఉన్నారు ! ఉన్నారంటే – నా అన్నది యవ్విధమైన పదార్థమూ లేకుండా, కేవలం హరినామ స్మరణకోసమే, – బ్రతికి ఉన్నారు ! ఆ నిమధయోగ్యుణ్ణి అమ్మడు హుటాహుటీ లేవదీసుకుపోయింది !

తాతయ్యా ! లేచిపోతావా అన్నది !

ఎవరితోనే? – అన్నాడు ఆ పండు - కొంటెగా.

నాతోనే ! – అన్నది రవీమని ! –

తాతగారూ - ఆఁ - ఆఁ - అనుకుంటూ ఉద్ఘ కుడుచుకున్నాడు:

నీ జన్మానికీ శివరాత్రి తాతయ్యా! - ఏపోణౌమూ ఎరుగకుండా - యిలాగే పుట్టుకొస్తివి! - నిన్ను లేవదీసుకుపోవడం - నాకు ముచ్చట - నీకు అచ్చట! - లే - అని బలవంతపెట్టింది!

నన్ను లేవదీసుకువెళ్ళి ఏం చేసుకుంటావే!

సుఖపెడతాను!-

ఈ వయసులో - కాలుజారి పడమంటావా?

పడితే చెడవులే తాతా - ఇన్నేళ్లు కాలు కదలపకుండా బ్రదికావ్! - ఒక్క నిమిషం ఓపికచేసుకుని, పళ్ళు బిగివిని బాలాకుమారుడివి అయితే - వచ్చేజన్మకు అటోస్తుంది! - అన్నది!

సరే యిందులో మనకు తెలియని పరమార్థం ఏదో లేకపోతే పరమాత్మ యీ కుర్రదానికి యిలాటి సద్బుద్ధి పుట్టిస్తాడా అనుకుని, - తాతగారు - కూచున్న చోటనుంచి లేచారు!-.

3

రైల్లో ఉన్నంతసేపూ, - తాతయ్య తొడమీద తల పెట్టుకుని కాళ్లుముట్టుకూ అటువక్కను కూచ్చున్న పడుచు

వాడికి తగలకుండా ముడుచుకుని పడుకునే ఉంది అమ్మడు - ఆకలివేసినప్పుడు తప్ప !

తాతయ్యా !- తల బరువుగా ఉంది !- అనిమూలిగింది!

పాపం ! - అలాగా అని గొణుక్కుంటూ జబ్బ పిసికాడు !

అబ్బ ! ఎంతసేపు యీ వాడునిద్ర ' - అని మూలిగి ఒళ్ళు విరుచుకుంది ! - తాతయ్య, - నుదురు పుణుకుతూ, - పడుకుంటే నాకేం బరువా. - అలాగే నిద్రపో ! - అంటూ యాదాలాభంగా చిచ్చికొడుతూ కూర్చున్నాడు ! -

ఇలా పడుకుని ఎన్నాళ్ళైందో తాతయ్యా! అంది!

తాతయ్యకు - కళ్ళనీళ్ళ పర్యంతమైంది !

౪

ట్రాములూ, కారులూ అడ్డ దిడ్డంగా పరుగెత్తుతున్నాయ్ !- అమ్మడు అటునుంచి యిటు దాటకుండా అక్కడే నిలుచుంది !

ఎవరిదో ధళధళలాడే కారువచ్చి - చూచి గ్రుక్కలు మింగుతూ అక్కడే ఆగింది : లోపల్నించి ఏనుగంత మనిషి - ఇటుచూసి యికిలించి,

ఎక్కడికి పోతారు ?- అన్నాడు.

అమ్మడు సరిగా అలాగే యికిలించింది :
ఎక్కమని – వెనుక – లోపలికి చేయి విసిరాడు !
ఎక్కనని – మళ్ళీ యికిలించింది !–
ఎక్కడపడితే అక్కడ దింపుతానన్నాడు !
ససేమిరా ఎక్కనంది !

ఎక్కకపోతే ఏలాగన్నట్టు మౌనంగా గునిసి – కార్ స్టార్టుచేసి – యీవంక ఆవంక చూసి – మళ్లీ ఆపేశాడు : అతి స్వతంత్రంగా చూడటం మొదలుపెట్టాడు !—

ఇలా రమ్మని సరసంగా తల ఊపింది ! దిగివచ్చాడు ! అల్లంతదూరం అడుగులు వేయించింది : అక్కడ ఆగి – నిదానంగా అటు తిరిగి, – చెంప ఎగిరిపోయేట్టు కొట్టింది ! – అంత ఏనుగూ; లోలోపలే – అంభా ! అని అరచి, – కారులో పడిపోయింది ! – అటు పోతున్న నలుగురూ – అర్థంకాక ఆగిపోయినారు ! – ఆ లుచ్ఛా ! మా ఆయన – అని విడమరచి చెప్పి, – వయ్యారంగా సాగిపోయింది ! – పెళ్ళాలతో కాపురం చేస్తున్న మనుష్యులు బ్రతుకుజీవుడా మొగాలు వేసుకున్నారు. పెళ్లికాని కుర్రకుంకలు రొమ్ము విరుచుకున్నారు :

౨౩

రాత్రి సముద్రంబడ్డున పెళ్లివారి యిల్లల్లే ఉంది : పొడుగు పొడుగునా పట్టపవలల్లే ఉంది : ఈ ఊళ్లో చీకటి యింత అందంగా ఉంది కనుకనే యిన్ని దీపాలు పెట్టి రెచ్చగొడుతున్నారు ! – అంది తాతయ్యతో అమ్మడు :–

అందరూ తడిపొడి యిసుకలో చదికిలపడి – కూచునో పడుకునో ఉంటే – ఎవరో ఒక్క ఆడకూతురు, యకాయకి నీళ్ళల్లోకి దిగుతూంది—

చచ్చిపోవడానికి కారణం ?– అని గదమాయించింది అమ్మడు, రెక్కపుచ్చుకుని.

ఆ పిల్ల గింజులాడింది – తిట్టింది – కొట్టింది – వలవలా ఏడ్చింది – ఒడ్డున బలవంతాన కూలపడి – తన గాద అంతా చెప్పింది :– పూసగుచ్చినట్టు !—

అంతా విని, – అమ్మడు అందికదా – అయితే చచ్చి పోవడం ఎందుకూ ?

బ్రతికి ఏంచేయను !– అని ఆ పిల్ల బావురుమంది !—

నీ పేరేమిటి – అని ఉరిమింది అమ్మడు.

సంజీవి !—

నీ గొంతుకోసిన వాడిపేరు :—

ఫలానా అని చెప్పింది – కావలసిన సైనమంతా చెప్పింది !—

సరే నువుపోయి భోజనం చేసి హాయిగా పడుకో – నేను వాడిని పలుకరించి వస్తా – అన్నది అమ్మడు !

'లాభంలేదు – అది గుండెకాదు – రాయి !–

కరగకపోతే – పగలేస్తా – కళ్ళు తుడుచుకో.

—తాతయ్య వెంట కుర్రదాన్ని పంపేసింది !—

౬

బాగా, ఓ పాతికమంది గుమస్తాలు ఉన్నారు!- పానకా లంటే భారీగా వ్యాపారం చేసే మనిషే !-

ఏరీ అయ్యగారు !- అని అతి స్వతంత్రంగా అడిగింది అమ్మడు !-

ఇప్పుడే కారులో వెళ్ళారు!- అని సమాధానం చెప్పారు ఎవరో-

నేను అనుకుంటూనే ఉన్నా!- వస్తానని పసిగట్టి దూసు కున్నా రన్నమాట - ఏమండీ మీరందరూ సంసారులా గుండ గొయ్యలా !- ఎవరన్నా అడగరాదూ మీకిదేం బుద్ధని!- కట్టుకున్న పెళ్లాన్ని అలో లక్షణా అని,- ఆ ఊళ్లో పడి ఉండ మని - తానిక్కడ యీ నాటకమూ ?- సిగ్గులేకపోతే సరి !-

అమ్మడు ఛరఛరా నడిచిపోయింది ! - ఆ వచ్చిన యిల్లాలు అయ్యగారి భార్య అని, గుమస్తాలు అందరికీ అర్థం అయిపోయింది.

అయ్యో ! - తమకోసం అమ్మగారు వచ్చారని, - బెరుకు బెరుకుగా మనవిచేసిన బంట్రోతుమీద పానకాలు మండిపడటంతో అందరూ ముక్కుమీద వేలువేసుకుని - మన యజమానికి యిదేం పోయేకాలం - నిక్షేపంలాంటి ఆ అమ్మను అలా ఏడిపిస్తున్నాడేం అని, ఆసహ్యించుకున్నారు!- నాకు పెళ్ళాంలేదు - పెళ్ళే కాలేదు - అని, పానకాలు

ప్రమాణం చేసినట్టూ చెప్పాడు - కాని ఎవడికివాడు శివ శివా అనుకుంటో చెవులు మూసుకున్నాడు—

౭

ఆమ్మాడు తల్లీ,- అన్నాళ్ళనుంచీ ఉంచుకున్న పెద్ద మనిషీ - ఒకళ్ళో యిద్దరో వత్తాసుగా ఒక్కొమ్మాడిగా కట్ట కట్టుకునివచ్చి వ్రాలారు: పవలంతా నిద్రా నిప్పాలూ లేకుండా బ్రతిమాలారు ! – అమ్మాడు, సందెపడేదాకా అందరినీ అతి మర్యాదగా చూసింది !

చీకటి పడినప్పటినుంచీ, – తల్లీ అల్లుడూ కూడబలు క్కొని సిసలైన మల్లెపూల పాన్పు వేశారు : చుట్టుపక్కల దేవాలయాల్లోకి వెళ్లి ప్రదక్షిణాలు చేసి, ప్రసాదం పట్టుకు వచ్చారు - అందరూ బువ్వంబంతిగా భోజనంచేశారు:—

ఆ ఆనామి బిక్కమొగం కటకట చూసి తాతయంటి వాడికే మనసు కరిగింది. పోనీవే అమ్మాడూ, వాడలా ఇదువు తూంటే మొక్కు తీర్చుకోరాదు టే – అన్నాడు—

నిజమే కాని, తాతయ్యా !– పోనీ పాపం అనుకుందా మన్నా-ఇక్కడ యీ గవర్నమెంటువారి పోరోటి వచ్చింది కద ! ఇలాటి నగరాల్లో సంసారమే కాని,– వ్యభిచారం చేయ నివ్వరు !– తెలిస్తే ఆయనకు తంటా !—

ఆఁ – ఇలాటివి ఎవరన్నా తెలిసేట్టు చేస్తారు టే :—

తెలియక తప్పదు తాతయ్యా !- మన ఊళ్లోలాగా కాదు- అన్నీ మెరుపు దీపాలే !- మేడలకు కళ్లుంటాయ్- గోడలకు చెవులుంటాయ్ !—

వచ్చిన జనాభాయావత్తూ, ఇకలాభం లేదనుకున్న తరువాత,- ఆపూట రైలుకే వెళ్ళిపోయింది:

అరవైయోపడి దాటిన వాళ్లను గవర్నమెంటు లెక్క-ల్లోంచి కొట్టేస్తారులే తాతయ్యా !- నిన్ను ఎవరూ ఏమీ అనరు !- ఇంత పక్క-మీద నేనొక్క-ర్తెనూ పడుకోలేను- అని తాతయ్యను పసిపాపణ్ణిచేసి బజ్జో పెట్టుకుంది !-

౮

నీ వేషాలు నా దగ్గర సాగవ్ - పోలీసుల్ని పిలుస్తాను అని బుకాయించాడు, పానకాలు !

అదే నేనూ అనేది-వాళ్ళచేత బుద్ధిచెప్పిస్తే కాని - కాపురం కుదుట పడదు-అంది నిర్భయంగా అమ్మడు !-

పానకాలు జంకాడు ; అంగడిలో చిన్నా పెద్దా ఒక్క-మ్మడిగా తెగేసి చెప్పారు- అయ్యా !- కానీపోని పోకడలు పోయే సన్యాసులకు గడ్డిపెట్ట వలసిన-తమరు – అగ్నిసాక్షిగా పెళ్ళాడిన ఆతల్లిని ఇలాచేయడం మనకు శుభంకాదు – అని –

మొర్రో ఇది నా పెళ్ళాంకాదు – అని పానకాలు నెత్తీ నోరూ కొట్టుకున్నాడు-

వల్లినా వల్లకపోయినా - ఎల్లకాలం నా పసుపూ - కుంకుమా చల్లగా ఉంటేచాలు - ఆ మాట మటుకు అనమోకండి !- మీ భార్యనుకాను అనమోకండి - అని అమ్మాయు, నిశరంగా కన్నీళ్లు తెప్పించుకుంది !-

ఆ కంటితడి చూసేప్పటికల్లా - అదివరకల్లా అయ్యాచిత్తం అంటూ బ్రిదుకుతూన్న అందరూ కత్తులైపోయినారు! రెక్కలుకట్టి నీ కాళ్ళమీద పడేస్తాం అన్నారు: అమ్మాడే అందరినీ సముదాయించింది. సర్ది చెప్పింది: నా దైవాన్ని నాకళ్ళ ఎదుటనే అవమానిస్తారా అని - మరి ఇంకొక్కసారి ముక్తసరిగా కన్నీరు తెప్పించుకుని - పానకాల్ని రెక్కపట్టుకుని స్వంతగదిలోకి తీసుకువెళ్ళి కుర్చీలో కూలవేసింది -

పదివేలిస్తాను - నా ప్రాణం తీయకుండా పో - అని పానకాలు చేయెత్తి మ్రొక్కాడు !

అంత తేలిగ్గా వదుల్తానా - అంది అమ్మాడు !

వదలక - అని నిలువుగుడ్లు వేశాడు -

పెళ్ళిచేస్తానోయ్ మగడా - అంటూ నవ్వింది: పానకాలుకూడా యికిలింపులోకి దిగాడు -

నోరుముయ్ - ప్రంఘాఖోర్ !- డబ్బెట్టుకు బ్రతికేవాడివి నీవు - నోరెట్టుకు బ్రతికేదాన్ని - నేను -

ఇంతకూ - ఎవరు నీవు తల్లీ ! -

సంజీవి అక్కను ! -

ఆఁ - !

ఆc – ! దిక్కు లేందనుకుని – నీ దిలాసా తీర్చుకుని – పోయి సముద్రంలో పడమన్నావ్ – అంతేకాదూ ? – దాని ప్రాణం పోతేనేం – డబ్బుందికా – దాని అక్క మరొకతె వచ్చేది అనేగా నీ హజం ! – ఇదిగో వచ్చా ! –

పానకాలు - కాళ్ళబేరానికి వచ్చాడు ! – చెంపలు వేసుకుని చెప్పినట్టల్లా విన్నాడు : తాతయ్య, - వేదోక్తంగా వాడిచేత సంజీవికి మరో చేసువప్పాళ్లో స్వామి సన్నిధానంలో మూడు ముళ్లూ వేయించాడు.

దంపతు లిద్దర్నీ ఉదకమండలానికి బండి ఎక్కించింది-అమ్మడు –

౯

అమ్మాయ్ నీవు సినీమాల్లోకి దిగావా అంటే–అని,– ఒక ఆసామి అమ్మడితో గుటకలు మింగాడు.

నాకు, – దించడమే కాని, – దిగడం అలవాటు లేదే– అంది.

అంటే —

మా అమ్మను కనుక్కోమంది !—

ఏమని—

ఉంచుకునేందుకు – ధర ఎంతో !—

ఆసామీ తేళ్ళూ జెర్రులూ ప్రాకినట్టు కంపరం ఎత్తి – కూచున్న చోటనుంచి లేచాడు – ఏ నాలుగు లక్షలో తగుల

వేసి చూసేవాళ్లందరి ఉసురూ పోసుకునే బదులు - ఓ మూకై
వెలితుపారేసి - ఓ పూటో ముప్పూటలో పిడ్డురవేస్తే -
డబ్బున్న బద్ధకం వదిలిపోతుందిగా - అని అమ్మడు చెప్పి
గొట్టింది :

ఆనామి కక్కిన పేను—

౧౦

ఎవరో జమీందారుగారట - కబురంపించారు : ఏం కావాలన్నా యిస్తారు. ఏది వ్రాసియివ్వమన్నా యిస్తారు - ప్రాణాలన్నీ నీమీదే పెట్టుకున్నారు - అని -

సరే - అంత ప్రాణసంకటంగా ఉంటే దయచేయమంది - అమ్మడు—

ఈ జమీందార్లకు ఎన్ని ప్రాణాలుంటాయేం తాతయ్యా - అని, అతి అమాయికంగా అడిగింది : తాతయ్య పొడిదగ్గు దగ్గాడు—

జమీందారుగారు - ఆఖరికి పెళ్లి చేసుకునేందుకుకూడా పెద్దపడినారు.

మరి - నాకు యిదివరకే పెళ్లైఉంటే -

మాకు - అభ్యంతరం లేదన్నారు - శ్రీవారు -

అయితే - మావారిని కనుక్కుంటానంది - అమ్మడు - తాతయ్యని పిలిచింది - అంతే—

౧౧

మళ్ళీ రైల్లో – తాతయ్య తల ఒళ్లో పెట్టుకు కూచుని కునికిపాట్లు పడుతూంది అమ్మడు –

ఎందుకొచ్చినట్టే మనకీ తిప్పట–అమ్మడూ అన్నాడు తాతయ్య !

నీకు కాకపోయినా – చేతిమీదుగా ఓ పెళ్ళి చేయించావ్ గదా–

నీమాట !–

ఏదో నాలుగురోజులు ఆటవిడుపు !– తాతయ్యా !– పెళ్ళాన్నయితే– ఏ పురుడుకో పుణ్యానికో అంటూ పుట్టింటికి వెళ్ళడం ఉండేది !– నాపుటక అదికాదుకా–ఇదో ముచ్చట!– యీ బ్రతుక్కి –

తాతయ్య పసిపిల్లవాడిలాగా రాగాలుపెట్టి – నీది, దేవతా పుటకే అమ్మడూ అన్నాడు –

పుట్టింది – మటుకు నాగేటి చాలులోఅని ఫక్కుమంది అమ్మడు–

౧౨

ఇన్నాళ్ళకు – మళ్లీ – అంటూ ఉబ్బి తబ్బిబ్బైనాడు ఆసామి !–

ఏమిటూ కలవరింత – నే నెక్కడికి వెళ్ళాను – అంది అమ్మడు – ఆసామి తెల్లమొగంవేశాడు – అమ్మడు నోరు నొక్కేసింది – ముద్దుగా–

–వేయి దేముళ్ళకూ మ్రొక్కిన మొక్కులన్నీ – ఆ పూటనుంచే ఒక్కొక్కటీ చెల్లించడం మొదలుపెట్టింది – కొన్నతల్లి–

తాతయ్య – యథాస్థానంలో కొత్తసేలువ కప్పుకొని– అలవాటుగా దగ్గుకుంటూ ఆపదమొక్కులవాడి స్మరణ చేస్తున్నాడు !–

# ద్విపద

పెళ్ళినాటికి కుఱ్ఱవాడు చూడబోతే అన్నిందాలా మాంచి నదరుగా ఉన్నాడు. పెళ్లిపీటలమీద సరసను కూర్చుంటే పిల్లా పిల్లవాడూ, చిలకా గోరింకా మల్లే కను ముద్దుగా ఉన్నారు: కాని,- పానుపు వేసినప్పుడు. . ప్రపంచం తలక్రిందులైంది: తెల్లవార్లూ పెళ్ళికొడుకు- బెల్లంకొట్టిన రాయి!-

—సిసలుగా - అంతే!-

ఈ మగత, పిల్లది యీడేరినప్పుడు. సంబరాల్లోనే పిల్లతరఫువారు, చూచాయగా పొడగట్టారు: ఆ మూడు రోజులూ, రోజుకో రకం పూలమంటపం కట్టించి, పిల్లదానికి, రోజుకో రకం వేషంవేసి,- ఊరూ నాడూ ఏకమై ఉత్సవం

చేస్తే– వచ్చిన పెళ్ళికొడుకు,– ఏరోజు కారోజు రెపరెపలాడి పోవడానికి బయలు - దేరినట్లు,- చిరాకు పడ్తున్నట్లు,- పరధ్యానంగా ఉన్నట్లు,- నావాసంకోస్తే,- పిల్లదాని అన్నగారు,– వెంటనే కనిపెట్టేశాడు: కాని,- పరాచకమాడితే, బయట పడక పోతాడా అనుకుని–

'ఏం బావా! – నా చెల్లెలని చెప్పుకోవడం కాదు కాని, – పిల్ల – అధిక – చక్కందయ్యో!–' అని కదలేశాడు: పెళ్ళికొడుకు మొగం తిప్పేసుకున్నాడు: గానసరది, మళ్ళీ అందుకుని, –

– 'ఏదో, మా చేతనైన వేషాలు మేం వేయించాము: నీ చేతుల్లో పడ్డాక ఎల్లా తయారుచేస్తావో – సినిమా పత్రికల్లో బొమ్మలు చూచుకునే శృంగార పురుషుడివి–' ఇలా కవ్వించాడు: పెళ్ళికొడుకు గండుచీమ కుట్టినట్టు మౌనంగా విలవిల్లాడాడు:

– పేరంటానికి వచ్చిన పడుచులూ. పిలువని పేరంటంగా తొంగిచూసిన ఉడుకుమోతులూ, – అలా కళ్ళప్పగించి పిల్లదాన్ని చూశారే! – ఈ పీనుగు పిల్లది ఎక్కడ కళ్లబడుతుందో అని, ఉన్న నాలుగునాళ్లూ తప్పించుకు తిరిగాడేం! –

'బిడియమేమో!' అనుకుంది పిల్లతల్లి.

'కొందరి తత్త్వమే అంతేమో!' అనుకున్నాడు–తండ్రి! నవ్వులాటకు అప్రమేయం వచ్చినా,–పెళ్ళికూతురికి ఉక్రోషం వచ్చి పారిపోయింది:

సరే! ఆరోజుల్లో అయిందేదో అయిపోయింది! కాని,- తీరా, యిప్పు డిదేమిటి?-

మరునాడు ఉదయం,- పిల్లదాన్ని తడవిచూసిన ముస లమ్మలు, రవంత మూతి విరుచుకున్నారు: మరోనాడు,- ఇదేమా అని ఆలోచనలో పడ్డారు: ఇక, మూడోనిద్రకూడా అయిపోయిన తరువాత,- 'అయ్యో రాతా!-' అని ముక్కు మీద వేలేసుకున్నారు: పిల్లవాడు చూడబోతే పోతబొమ్మల్లే ఉన్నాడే!- అబ్బ వంక,- అమ్మవంక ఎటు చూచినా,-ఆ రెండు వంగసాల్లో ఏవక్కరికీ,-యిలాటి అవకరం లేదే-ఇతగాడికైనా ఇలాటి వంకర ఉందని,- గిట్టనివాళ్లైనా అనకపోయిరే,- ఈడూ - జోడు పిల్లలందరూ,- గంతకు తగిన బొంతతో, నిక్షేపంగా కాపరాలు చేసుకుంటూండిరే- ఈ చిన్నదానిగీతే ఇలా కావాలా?-

ఇలాటి అచ్చట,- సర్వసాధారణంగా, ఇరుగు పొరుగు వారందరికీ, మా చెడ్డముచ్చట-కాని, యింట్లోవాళ్లతో బాటు, అటూ ఇటూ మెసలే ఆసెమ్మలూ,- ఓసెమ్మలూ, అందరూ ఉసూరుమని పోయినారు:

పిల్ల తల్లి,- ఏడుకొండలవాడికి మొక్కుకున్నంత బిగలాగా, కన్నతండ్రిదగ్గిర మొరబెట్టుకుంది: తండ్రి,- యిది తాను ఆలోచించవలసిన విషయం కాదన్నట్టు, కొడుకు మీదికి త్రోసేశాడు: కొడుకు, యీ తలవంపు యావత్తూ తనదే అన్నట్టు మండిపడి, - ఒక్క బళ్లో యిన్నేళ్ళూ తనతో బాటు చదువుకున్నవాడు,- చివరకు యిలా పరువు తీసేస్తాడా

అని, పట్టుకు తిన్నబోయినంత ఉమ్మలికంతో, - బావ మరిదిని, - బందకు రాదారిమీద బస్సుఊపినట్టు ఊపేశాడు :

'ఎందుకురా కోపం ?'

జవాబు - 'నా కెందుకురా కోపం -?'

'లేకపోతే - ఇదేమిటి ?-'

'ఇదేమిటంటే - ఏమిటి ?'

'ఎందుకు చేసుకున్నావ్ - పెళ్లి ?'

'కట్నంకోసం ?'

—శోభనపు పెండ్లికొడుకు గూబ ఎగిరిపోయింది : ఆ విసురుకు, - యింట్లోవాళ్లందరూ : - ఏమిటంటే ఏమిటనుకునే గందరగోళంగా, - 'ఏదో మా యిద్దరి సరసం !' అని, బావ మరది వెంటనే సర్దిచెప్పాడు : పెళ్లికొడుకు, - అంతకన్న మరేమీ విశేషం లేదన్నట్టు - నుతారంగా, చేతనైనట్టు చిరునవ్వు నవ్వడానికి యత్నించి, అక్కడనుంచి తప్పుకున్నాడు.

మళ్లీ, - మరో గదిలో, బావమరదు లిద్దరూ తారసిల్లారు : పెళ్లికొడుకును జర్మన్ యుద్ధపై పీకిమళ్లీ నిలవేసి, - బావమరది మరో విడత, - మాటలతో గూబకద లేయడం ప్రారంభించాడు -

'ఒరేయ్ - బావా! - బైబిల్ పాత నిబంధనలో యాకోబు, రెండేడు పధ్నాలుగేళ్లు, పెళ్లాంకోసం గొర్రెలు కాచాడు : అప్పటికి యిప్పటికీ ఎంత తేడాఉందో చూశావా! కావాలని కాళ్లుకడిగి, పిలిచి పిల్లనిస్తే - ఎందుకోయ్ యీ

నీలుగు ? – రొఖ్ఖం పుచ్చుకోడంవరకేనా నీ ప్రయోజ
కత్వం ?...'

పెళ్లికొడుకు దేనికీ జవాబు చెప్పలేదు – పిల్లను
వెంటతీసుకుని, – స్వగ్రామం వెళ్లిపోయినాడు :

అక్కడా పిల్లదాని అత్తగారు, – పానుపు వేయిం
చింది : పక్కనిండా మల్లెలు చల్లించింది : పిల్లను ఇను
మిక్కిలిగా ముస్తాబుచేసి, – ముత్తైదువలందరిచేతా పాటలు
పాడించింది : వేడుకలన్నీ త్వరగా తెమల్చి, – గదితలుపులు
వేయించింది : రాత్రికి అటు కేసి, పిట్టపోకుండా కట్టుదిట్టం
చేసింది :

పెళ్లికొడుకు, – పాయసంలో తనవాటా ఆప్యాయ
నంగా ఆరగించాడు : ఆకూ, వక్కా అందిపుచ్చుకున్నాడు –
కాని, – ఆనాటికీ అంతే !–

అంతేనా ?–

పదిగంటల ప్రొద్దోయింది : ఇసుగు పొరుగూ, –
కొంచెం కుడీ ఎడంగా మాటుమణిగింది. పిల్లది, రమారమి
గంటసేపటినుంచీ, – కిటికీదగ్గిర అలాగే నిల్చునుంది :– ఇక
నిలుచోలేకపోయింది : ఆపళాన, – అటు ఓరగా చూసింది :
పెళ్లికొడుకు పుస్తకమల్లే పడుకుని ఉన్నాడు :–

చరచర వెళ్లి జబ్బపట్టుకుని ఊపింది : నిదుర లేపింది:–
మేలుకున్న మగవాడు ఉలికిపడి లేచికూర్చుని, పిల్లదానివంక
చూసి, కన్ను తెరవలేకపోయినాడు : పిల్లది, పానుపుమీద
సరసకు జరిగింది :

'నిద్రా ?

'భద్రా ?

'అత్తవారింట చేసిన హామీలు చాలుగాని,—పుట్టింటైనా బుద్ధి తెచ్చుకోండి !—'

పెళ్లికొడుకు కొంచెం కోపంగా కన్ను తెరిచాడు—

'మీకు కోపంవస్తే – నే నూరుకోను :—

నాకు కోపం తెప్పిస్తే—మావాళ్లు ఊరుకోరు—

మౌనంగా ఉంటే యిచ్చిన దేవత లూరుకోరు :

చనవు చేతగాకపోతే మానె – కవ్వించినా చేయిచేసుకోరం ?—'

పెళ్ళికొడుకు బుద్ధుడల్లే అలాగే కూర్చున్నాడు :

'పెళ్ళిచూపులకని వచ్చి,—ముక్కూ మొగం ఎరుగనిదాన్ని కళ్లతో పలుకరించారు :

పలువరుస కనబడకుండానే,—మనసుతోనే నునవ్వైందని నాకే తెలిసేట్టు చెప్పారు !

పెళ్లిలో మనవాళ్ళు తీయించిన ఫోటోలో, – నాకోసం లోకాలన్నీ జయించుకువచ్చే వీరాధివీరుడల్లే నిలుచున్నారు:—

తమరు – ఆ పెళ్లికొడుకేనా'—

పెళ్ళికొడుకు పానుపు దిగి వెళ్లి మరచెంబు ఒంటిచేతి మీద ఎత్తి చెంబెడు నీళ్ళూ గుక్క ఆపకుండా తాగేశాడు : వచ్చినత్రోవనే ఒక అడుగు వేశాడు :

'ఆగండి ! – అక్కడే ఆగండి ! రణతిక్కన్న యింట్లో ముగ్గు రాడవారు ! యీ గదిలో యిద్దరాడవారు !—'

పెళ్ళికూతురు, - అత్తవారు కట్టబెట్టిన ఉప్పాడ చీరె,- మక్కువగా కుట్టించుకున్న రవిక డుల్చి, - పెళ్లికొడుకు మీదికి గిరవాటు వేసింది :

'కట్టుకోండి !-'

పెళ్ళికొడుకు, - రిప్-వాన్-వింకిల్ నిద్రలేచినట్లు - అమాంతం మేలుకున్నాడు !-

'కట్టుకోరేం ?-'

-మాట వినిపించుకోకుండా,- పిల్లదాన్ని పొదివి పట్టుకున్నాడు :

-ఎంతగా నెంతోసేపటికి,- పెళ్ళికూతురు,- ఆద మరచి,- అడిగింది...'ఎందుకలా మారిపోయినారూ ?-'

'చెపితే నవ్వితే ?-'

'నవ్వేందుకు ఓపిక లేదు-'

-అందుకు,- యిద్దరూ నవ్వుకున్నారు. ఒకరు చెప్పగా- ఒకరు విన్నారు :

'ఏదో స్టుడియోలో,- రాజాంతఃపురంలో,- ఓసింగారిని చూశాను: మర్యాద కాదని తెలిసినా పదేపదే పరకాయించి చూశాను : సిసలుగా వీనస్ అంత బందోబస్తుగా ఉంది : ఆవిడబొమ్మ ఏదో పత్రికలో మామూలు ధోరణిలో చూశాను : ఆ పరువూ, బరువూ,-ఏకోశానా లేదు : యింత తేడా వలా అని, అష్టకష్టాలుపడి,- ఆవిడ భవనానికి వెళ్లి,- దర్శనంచేసుకున్నాను : రామ రామ !- తగుపాళం పొన్న కాయలాగా ఉండే మా మేనమామ నయం- ఆ అంగన

కన్న!-ఇలానే రెండుమూడు ఘట్టిచోట్లజరిగింది: కళ్లుమూసుకు నడుస్తూంటే గోడతగిలి నొసలు బొప్పికట్టి నట్లయింది:

'...ఏదో బళ్లో చదువుకున్నాను,- పరీక్షలో నెగ్గు కొచ్చా నన్నమాటేకాని - నిజంగా ఏమీ అభమూ శుభమూ తెలియని ఋష్యశృంగుణ్ణంటే ఎవరూ నమ్మరు: కాని,- నా పెంపకం అలాటిది! పరాయి ఆడపిల్లవంక పొర బాటునైనా తలఎత్తి చూడనాయెను!

'అదివరకల్లా కర్ణుడి సహజ కవచకుండలాలల్లే,- ఆడ వాళ్లుకూడా, సలక్షణంగా పుట్టినవాళ్లే అని అనుకుంటూ ఉండేవాణ్ణల్లా, - ఆ చూపుల బాపతు, తేల్చుకున్న దేమంటే- గ్రీకు శిల్పులందరూ, - మన కనువ్రతకోసం తంటాలుపడి అలాయిదాగా అమర్చిన ఉవ్వెత్తులేతప్ప, - బ్రహ్మదేవుడు, ఆడవారికి ప్రత్యేకం మలచిన వరాలేవీ లేవేమో అని!-

'కాని, కేవలం అలానూ అనుకునేందుకువీలు లేకుండా,- పసితనంలో తల్లి యిచ్చిన పాలు గొంతులో కొరమారినవి: కనుక, - కలదు కలం డనెడివాడు కలడో లేడో అన్నట్టు ఆ తబ్బిబ్బులో పడిపోయినాను:

'నీ ముస్తాబు చూడగానే-ఆ అనుమానంకన్న ముందు, కొండంత భయంవేసింది: లేకపోతే, మీ వాళ్ల చేత అన్ని మాటలు పడిఉండేవాణ్ణా!-'

పెళ్లికూతురు, చాలా జాలిపడ్డది -

'ఈ మాట ఆనాడే చెప్పిఉంటే-!'

పెళ్లికొడుకు మగసిరిగా జవాబు అందుకున్నాడు-

'నీవు ఈ చొరవ ఆనాడే చేసిఉంటే-!'

# దారుకావనం

అందరు ఆహితాగ్నులూ, తలో పుడిసెడు తీర్థం యిస్తే - అది పుచ్చుకుని, - బాధలేకుండా భగవాన్లు, - గుర్రా లెక్కివస్తున్నానని ఆకాశంలో ఒక పక్క పొడిచాడు-

వాడికన్న ఎంతకుముందో, వీడు వచ్చేశాడు -

ఊరికి ఎండెక్కింది - ఆకలి ఎక్కింది-నీలాటి రేవులో, ఏదో ఒకటో అరో, -.నిండుకుండ తొణికే ఓపిక లేక అలా నిల్చిపోయిఉంది-

రేవు దిగాలుపడి ఉంటే, - పాపం కదా అనుకుని, - వీడు దాహం తాగుదామని, నీటి చాలుకు వంగాడు, నీడలు పైనేసి లాక్కున్నాయి - బుజ్జగించినట్టు, - లేత చెక్కిలిమీద, చేసే మారాము ముద్దొచ్చి అలా పుణికినట్టు, - నీటిపాయను

అనేసి, ముందుకు అడుగు వేశాడు - తామర తంపర పెనవేసు కుంది - పట్టుచిక్కక జారిపోయింది - ఉసూరుమంటూ కుప్ప కూలిపోయింది -

వీడు, - నడిబొడ్డుమీాద, అంగులు, లెక్క పెట్టు కుంటున్నాడు :

'ఒరేయ్ ! - అబ్బీ !

'ఏయ్!- నిన్నేరా ?

'ఇందరా, కానీ !

-వినిపించుకుంటూ నవ్వుకుంటూ చక్కా పోతు న్నాడు: పోగా పోగా, ఏ ధర్మతల్లో, గుమ్మంలోకి వచ్చి, ఆగమని కేకేసింది: పట్టెడుపిడచ పడేస్తాను ఉండమంది :

'వద్దులే తల్లీ !-' అన్నాడు!-

'ఏం, అదేం పోయేకాలంరా నీకు?' అని గద్దింపుగా ముందుకు వచ్చింది:

'నిలు,- అక్కడే నిలు అంట !'

వీడు,- పోనీ- పాపంగా, నిలవబడి పోయినాడు- ఆ యిల్లాలు,- వీడిని పట్టుకుని, అటు ఏడు తరాలూ, ఇటు ఏడు తరాలూ,- పనికిమాలినవాళ్ల కోవను అంతా తూర్పార పట్టింది- వీడికి,- ఎండ కన్నెరుగని ఆ తల్లి, కడుపులో చల్లంతా, అల్లా గలబరించుకుంటూందేమా అని. తగని జాలివేస్తూంది: ఆ వగర్పూ, ఆ తామసం చూసినకొద్దీ, నవ్వు ముంచెత్తు కొస్తూంది !

నాళ్ల నడుమేమో,- నలుగురు ఇల్లాళ్లూ,-చోద్యం చూడటానికి అక్కడ పోగైనారు: ఎందుకు అలా తిట్టిపోస్తు న్నావ్,- మిట్టమధ్యాహ్నంపూట, అని ఒక్కరూ అడిగిన పాపాన పోలేదు: ఆ ముష్టి వెధవ ఏమన్నాడు,- ఏంచేశాడు?- అని అందరీ ఆదుర్దా:

ఆవిడ - ప్రజల్లో పడ్డతరువాత,- రొప్పు రవంత సంబాళించుకుని,- మాటకుమాట పేనుతూ, వీడిమీద సవా లక్ష పితూరీ పెంచింది: వీడి పొగరుమోతుతన మేమిటో- అంతు కనుక్కోవలసెందే అంది: ఇందుకనే, వీళ్లిలా మలమల మాడిపోవటం, అని శాపంగా అంది:

అందరూ, నిజమే అన్నారు-! అందులో ఓ తల్లి,- 'ఏంరా, పిలిచి బిచ్చంపెడతా నంటే,- వద్దనడం నీకు యిదేం తెగులురా?'- అంది-

'ఏం చెయ్యను,- మాయమ్మా!- ఆకలి కాలేదు!' అని అపరాధం చేసిన గొంతుతో అన్నాడు,- నవ్వుతో ఉక్కిరిబిక్కిరౌతూ!-

'కాక ? - ఇదేమిటే అమ్మాయ్, - ఈ విడ్డూర్య మేమిటే ? ఏటికేడాదీ ఎండే వెధవకు, ఆకలి లేకపోవడ మేమిటే ?-' ఆ తల్లి, ఆశ్చర్యానికి అంతులేదు: పక్కనున్న పడుచును పట్టుకుని, - 'ఇదేమిటే ! - ఆc!-ఇదేం చోద్యమే!' అని జబ్బలు గుంజుతూంది: నలుగురు అమ్మలక్కలూ, - ముక్కుమీద వ్రేలు వేసుకున్నట్టు అయిపోయినారు: వీడు అంత నిర్లక్ష్యంగా, పోవడం, మాటకు మాట అనకుండా, -

అడిగినదానికి కావలసిన సమాధానం చెప్పకుండా – వీడూ, ఓ మామూలు మనిషల్లే, రెండుకాళ్ళతోనూ నడిచిపోవడం,– ఆ ధర్మతల్లికి నలుగురిలోనూ మరీ చచ్చిన చావైంది:—

'పోనీలేవే! – ఇందుకే వీళ్ళకు పుట్టగతు లుండవ్ !–' అంటూ, అందరూ సముదాయించి, – పుట్టెడు దుఃఖంలో ఉన్నట్టు ఆ యిల్లాలు, ఆపసోపాలు పడుతుండగా,– యింట్లోకి నడిపించుకు పోగలిగారు :

–వీడు అదేపోతగా, పోతూనే ఉన్నాడు: దోవలో గుడియేదో ఎదురుగుండా వచ్చింది: లంకంత ముఖద్వారం ఆగమని బ్రతిమాలినట్లు అనిపించి, – ఆగుదా మనుకున్నాడు: అనుకోకుండానే అడుగు ముందుకు వేశాడు: పోనీగదా అని ఆగాడు: నెల్లేవాళ్ళందరూ. లోపలికి, అతిమడిగా, అతి బరువుగా, అడుగులు వేస్తున్నారు: బయటికివచ్చే, మూకంతా,– అసుసుసురై పోయి, – కరిమింగిన వెలగపల్లల్లే, – తగని బోలుగా బయటపడుతూంది :

ఎవరో పొరుగూరునుంచి, ఆ దోవను పోతున్న ఆసామి, – ఆగి, చెప్పులు విడిచి, చేతపట్టుకుని, – జారవిడిచి లెంపలు వేసుకుని, గోపురంవైపు తలఎత్తి కళ్ళుమూసుకుని ఏదో గొణుక్కుని, – వీడిని, యాదాలాభంగా, – "ఏమిటి, ఇవాళ ?' అని అడిగాడు :

'ఏముందీ, మామూలే!' అని గాలిలోకి అన్నాడువీడు–

'అంటే !'

'అంతే !- పాపంచేసిన వాళ్లందరూ లోనకెళ్లి మస్త కేయించుకు వస్తున్నారు !-'

ఆసామి, ఉలిక్కిపడినట్టు 'ఆఁ !' అని బెదిరి, - 'కళ్లు పోతాయిరా, వెఱ్రోడా !' అని నయానే చెప్పాడు :

'కళ్లుపోతే, - చెవులు లేవూ ?' అంటూ వీడి ప్రశ్న-

'వెఱ్రి యెదవకు - యేదాంతం !' అంటూ ఆసామి గుంజుకుంటూ నాగిపోయినాడు, భయం - భయంగా నవ్వుకుంటూ,

—వీడు యింకా సాగిపోతూనేవున్నాడు - పోయిపోయి, కొంతదూరాన ఊరు ఆగిపోయింది : అవతల అదేదో, - మఱ్ఱిలాటి రావిచెట్టు - చెట్టుకు పసుపూబొట్టూ, - క్రిందంతా పొంగిలిరాళ్లూ,- పాలచారికలూ, -

ఎవరో ఓ పేరంటాలు పాలు పొంగించుతూంది-పొంగి పొర్లిపోయినప్పుడల్లా,-చేయెత్తి దణ్ణంపెడుతూంది: కొమ్మల్లో బ్రహ్మరాక్షసులల్లే పాత పక్షులన్నీ విలవిల లాడుతున్నాయ్. ఓ ముసలమ్మా ఓ పసిపిల్లా,- కాకాయ్‌లని తోలుతూ అష్ ఉష్ అంటున్నారు: ఇంకో బొడ్డు ఊడనివాడు,- కుక్కా- నక్కా ముందుకుదూకి కలియఃబడకుండా,-అమ్మ అండచూసుకుంటూ, కాపలా కాస్తున్నాడు :

ముసలమ్మ, వీడివంక అదోచూపు చూసింది - ముసలవాడు, చేతిలోవున్న పుల్ల, నేలకు వాలుగా దిగేసి,- బుజ్జాలుకట్టుకు, దానిమీద మోపుగా అని, ఆకలంత ధీమాగా గుర-గురలాడాడు.

వీను, చూసీ చూడనట్టు అసంతా దాటిపోయినాను. దోవకు అడ్డంగా రాతిమీద రాయి కూర్చుంది. దోవ, తలవంచుకుని తప్పుకు పోయింది - తన దోవను.

వీను, దానిమీద కూర్చున్నాను : రాయి, దాచుకున్న చిత్తుపిల్లాలు పస్తికుంది.

కుక్క ఒక్కొక్క :, అడుగు చెనక్కువేస్తూ, తోక, పంజా ముందుకు అవలింతగా జాపుతూ, ఇక్కడకు చేరుకుంది– అన్నీ. ఎటూ చూడటం మానేసినాయ్.

చిన్నవాడు, కవ్వింపు దిగజారిపోగానే, రోషంగా మొండితనంగా, – 'అమ్మా!' అన్నాడు :

పొంగించే యిల్లాలు, బస్తకంగా ఇటు చూసింది : చిన్నవాడిచూపు అందుకొని, పీడినంక చూసింది : అందినంత మేరా కలియజూసి, మళ్లీ తిరుగుముఖంగా, పీడినే చూసింది : రెప్పవాలేలోగా,- ఎంతోసేపు చూసినట్టు చూసింది – పొలిమేరలో కాపు వేసిన బసవన్ననుచూసి,– అయిన ఇంటి తేగలాగా, మెడ-జెముడుగా,– మళ్ళీ అటు తిరిగింది–

ఆ బెదురు, ముసలమ్మ అందుకుంది – కనుచూపుమేర ఎక్కడా, మరో మనిషి తోడు లేనట్టు కనిపెట్టింది– 'అయినంత వరకూ చాలు,- దించి, చేయి చూపించి, ఇక తెములు-'అని ఊవరపెట్టింది, కోడలిని.

అందరూ, కదిలారు : ముందు చిన్నవాడూ, వాడికి వత్తాసుగా, అవ్వ-ఆ అడుగుల్లో అడుగు వేసుకుంటూ, రాక్షసుణ్ణి

కవ్వించే మోహిని భంగిమంలో, పాయసం దుత్తపట్టుకుని, కోడలూ -

వాళ్లా యీవేపే రావాలి, - రాచుకుంటూపోవాలి - మరో దోవలేదు -

కుక్కలు, ఆశగా తోకలు ఆడిస్తున్నాయి - దగ్గరకు వస్తున్నకొద్దీ - వీడు, కూర్చున్నచోటే ఒళ్లు విరుచుకున్నాడు:

అవ్వా చిన్నవాడూ, దారి దిగి నడిచారు _ కోడలు అడుగు యింకా, దోవలోనే ఉంది.

వీడు ఒళ్లు ఝళిపించాడు : అవ్వ అమ్మయ్యో అన్నట్లు, చిన్నవాడిని తనచాటుకు యీడ్చుకుంది : వీడు కూర్చున్న పాళానే లేచాడు : కోడలు, ఎక్కిళ్లు మింగినట్టు నిలువు నిలువూ ఒక్కసారి గళబరించుకుని, - దుత్త జారవిడిచింది - కళ్ళు చేరెడు చేసుకుని ఒలికిపోయిన పట్టంతా చూస్తూ, - అడుగు వెనుకకువేసి, - అత్తమొగం చూసి, - ఏడుపు సాగించింది - కుక్కలన్నీ అంతమేరా కమ్ముకున్నాయ్ -

వీడు, నవ్వుకుంటూ పోతున్నాడు - కోడలు. శ్రుతి హెచ్చించింది -

కోపం తెప్పించుకు ఆగాడు : కొరడా ఝుళుక్ మన్నట్టు అటు తిరిగాడు.

'ఏమే కూతురా !- ఆరగింపైందని ఏడుపా ?- సంగీతం పాడు, - దేవుడు దిగివస్తాడు -?' అని నవ్వాడు : కోడలు, మాటమింగుకుని, దెబ్బతిన్నట్టు కూలబడ్డది -

'నవినోయ్!'- అవ్వాను, కసిరినట్టు కూకవేశాడు. ఎక్కడైతే నా భక్తులు సంగీతం పాడుతారో,- అక్కడ మనం ఎప్పుడూ ప్రత్యక్షం-' అని పాలపాశినట్టు అన్నాడు- గాలిబుడగల మీద అడుగులు వేస్తున్నట్టు,- నృత్యాన సాగుతున్నాడు-

చేలుదాటి, ఇంకోప్రాప్తు వచ్చింది- ఊరులోకి అడుగు పెట్టనీకుండా, తోట అడ్డం వచ్చింది- తోటకోసం, పువ్వులు.- పువ్వులకోసం పిల్లలు-

పూలన్నీ పైటలనిండా దోచుకు తెచ్చి,- ఆ ఒక్కతే పిల్లసరసను రాసులు పోస్తున్నారు: ఆ పిల్ల,- వాటిమీద, ఆనీ ఆననట్టు,- వ్రేళ్లమోపి,- వీణ మీటినట్టు పృణుకుతూ, మనసు ఎక్కడో పెట్టుకు కూర్చుంది-

'నీవు ఏరాజు కూతురివె కొమ్మా!
నీ పేరేమిటే ముద్దుగుమ్మ!'

తత్వం పాడినట్టు, వీడు, విరగబడి పాడుతున్నాడు- పిల్ల, విని, గరిపాడించింది:

'ఎగనేసుకుపోయే రాజకొడుకు- వేటాడుతూ ఇటు రాలేదా?-'

నవ్వుతూ ఒక్క అడుగు ముందుకు వేశాడు-వీడు. చిన్నది, యేడువారాల సొమ్ముల బరువుతో- పంచకల్యాణి మీదికి లంఘించే ఒడుపుతో కూర్చుంది- వీడివంక చూసీ చూడని శివితో, ఆస్థానకవిని పరకాయించినట్టు,- తల ఊపుకుంటూ తనలోతాను, కుమిలి- నవ్వుకుంటూంది-

'జయము జయము- మహారాణి !'

చిన్నది- అదేమన్నట్టు ఉలికిపడ్డది-

వీడు, మరో అడుగు ముందుకు వేసినట్టు,- గొంతు చేరువకు తెచ్చి,- దేవరహస్యంగా,- పెదవులు కదిలించకుండానే,- కాగలకార్యం,- చూపు మెలపులో వివరించాడు-

'ఎంతకాలం ఉంటాడు,- ముసలిరాజు !-

'యుద్ధాల్లో నాయంకావాలని, ఇంద్రుడు రథం పంపిస్తాడు- మాతలి తోలుకుపోతాడు-

'ఆ క్షణం నుంచి, మీ నాథుడే ప్రజలకు దిక్కు-

'ఓపలేని మహారాణి,- కిరీటం మోయలేనే అంటుంది- దాసదాసీ జనంబులు వల్లకాదు తల్లీ అంటారు-అంటూఅంటూ ఉండగానే,- వంశాంకురం-కేరుమంటుంది-

'మీ భరతుణ్ణి, నేను ఎత్తుకు ముద్దుచేస్తా !- బాణం గురి తప్పనీయనమ్మా!-'

-చిన్నది, చంద్రకాంత ప్రతిమ అయిపోయింది – సంతోషం ఓడిపోతూన్నది-

మల్లీ పువ్వులు చేరుకుంటున్నాయ్, రాసిదగ్గిరకు - అల్లంతదూరంలోనే పిల్లలనందరినీ ఆపేశాడు,-వీడు, వాళ్ళకు వీడి వాలకం చూసినా,- భయంవేసినట్టులేదు - రెక్కలు కట్టుకుని, ఏదో పక్షి, తూలుకుంటూ నడచిపోతున్నదని,- అంత వింతగానూ చూస్తున్నారు-

'కన్నె కుమారికి-కలలు నిండాయోయ్!-' ముందుకు

దూకినట్టు అన్నాడు- అందరికీ చక్కిలిగింతలుగా నవ్వారు-
నవ్వుత్తే పోతున్నారు-

'ఎవడే - వీడు!'

ఓ చిన్నది త్రుళ్ళిపడ్డట్టు,-ఎన్ని జన్మల వెనకాలనుంచో అడిగినట్టు,- తనలో తాను అనుకొంది-అన్నినాళ్ళుగా, అదే మాట పదవి-పదవి, వెంటాడినవి -

పీకి కూనిరాగం,- పాట గొంతులోకి వచ్చింది——
'మల్లెపంది రదిగో-ఇదిగో-' పాట ముందరికి సాగుతూంది - పీడి అడుగు, వెనకకు పడుతూంది-పడీ, పడీ, పిల్లలకు కూత వేటుగా, ఆగింది-కమ్చీ ఝుళుక్ మన్నట్టు ఎదుట మొగ నైనాడు-

'సుందరి!- మాధవు డల్లడుగో-' మాధవుడు, ఎన్ని హావభావాల హొయలయేదీ,- ఆ భంగిమాలన్నీ,- సాక్షుడు వ్రేలితో,- శూన్యంలో, బొమ్మలు వేస్తున్నాడు - పిల్లలు, వలబడ్డ జక్కవలల్లే-క్రిక్కిరిసి, కదలకుండా విలవిల్లాడుతున్నారు- పుస్తకం తాప్పునమూసేసినట్టు బొమ్మలు తిప్పడంమానేశాడు- పాఠం అర్థం అయిందా-అన్నట్టు పరకాయించి చూశాడు- పిల్లలకళ్ళు-పై పాఠాలు గడ-గడా వప్పగించేస్తున్నాయ్-

-ముతకకంబళీమడత ఎగిరి భుజానపడ్డట్టు - ముసలిగా కుదిలించుకు పోయినాడు-మనసులో తడుముకుంటూన్నట్టు- 'ఓ మల్లియలార!- మీ పొదలమాటున లేదుగదమ్మా-!' క్రియాపద జాలిరాగంలో, అనుకుంటూ అందిన తీవల్లా కదిలించి చూస్తూ-తోట దాటాడు-పేట దాటాడు-

దోవ, దారితీస్తూంది,-అడ్డంకొట్టి, చేలగట్టుమీదుగా పెద్దరోడ్డును అంటుకుంది -

ముందు, - పూటుగా ధాన్యపుబస్తాలు వేసుకుని భారీ ఎడ్లబండి పోతూంది - వీడు, రోడ్డుమీద అడుగు మోపగానే- అది, ఎగిరిపడి, - బండి రెక్కవాల్చింది: మొగ్గిన చక్రం, - పెళపెళమంది: పైపైన బస్తాలు ఒళ్లు విరుచుకున్నాయి: అడుగుపీటీని ఉన్నవి, పూర్వకాలపు ముత్తైదుల్లాగే, అలాగే అంటిపట్టుకుని ఉన్నవి -

ఎద్దులు, మర్యాదకోసం, బండీతోబాటు వత్తిగిలి, - యిది మనకు మామూలే అన్నంత యాదాలాభంతో, - లేచి నిలుచున్నాయ్ -

తోలుకు వెళుతున్న ఆసామి-కూలబడి పోయినాడు - మనిషి సాయంలేనందుకు కొరకొరలాడాడు: ఎందుకు అంత ఒడ్డూ పొడుపూఉండి - చేయి అందిచ్చేందుకు లేక - అను కుంటూ,- ఓపిక ఉన్నంతవరకూ,- ఎడ్లను బాదాడు: అవి. దెబ్బలు పడుతూ,- మారాంచేసే కుర్రకుంకను తాతగారు చూసినట్టు,- చూసి, వెన్ను అప్పగించి ఊరుకున్నాయ్ -

ఆసామికి చేతులు తప్పబడ్డాయ్ - బస్తామీద చేయి వేసి ఊపి చూశాడు: అది పైపైన గునిసి-, మొండికేసుకు ఊరుకుంది-మళ్ళీ చెన్నాకోల అందుకుని,- ఆ జతమీదికి ఊరుకుదామని లేచాడు-అవి కోడెలల్లే గంతులువేస్తూ-దూర దూరంగా కాచి, కవ్విస్తూన్నాయ్ -

పీడి అడుగు,– ఆసామిదగ్గిర పడింది–పీడిని చూడగానే, వాడికి ప్రాణం లేచివచ్చింది–

'ఇదిగో అన్నా – దేవుడొచ్చే పచ్చాడు!–' అంటూ, ఒక్క– తలవిసుపులో, తన అవస్థ, తనకు పీడు చేయవలసిన న్యాయం, యావత్తూ వివరించాడు –

పీడు,– వాడిని చూడగానే, వినగానే నవ్వే పడ్డాడు –

'నేను దేవుణ్ణికాను – దయ్యాన్ని!'

వాడు, తెల్లబోతూ–'అదేమిటి అన్నా!'అని గొణుక్కు న్నాడు –

'– దేవుడు నీ కెందుకు అక్కరకు వస్తాడు? పరమించ్చి పోతాడనుకో,– ఒరిగేదేముంది?–'

'మనం పట్టుకుంటే – మళ్ళీ వదలడమే–?'

–వింటున్నకొద్దీ ఆసామి కళ్ళు జైన్లు కమ్మినాయ్ – ఎన్నో ఊహాలున్న ఓ పొల్లు కేక వేసి,– దోవా తెన్నూ కాన కుండా,– అడ్డంపడి, ఎటో దూసుకున్నాడు.

పీడు, ఆ దోవ చెప్పినట్లు నడుస్తున్నాడు – మేసే ఎడ్ల జత,– 'శహబాస్'–గా తల ఊపింది.

'మనం ఎంతచేసినా,– పీళ్ళు యింతే–' పీడు చెప్పిన ఊసు వాటికి అర్థమై,– అవి నవ్వినాయ్ –

దోవ, ముక్కు–కు సూటిగా, పటిబట్టున మర్రికింద మాయమైంది –

మర్రిమీద బ్రహ్మరాక్షసి ఉందిగనుక – అంటూ,– ఆ నీడన్నా మీదపడకుండా నైదొలగి పోతారు –

చెట్టునీడను, దుబ్బుకట్టి ఉంది, పచ్చ. ఏనాటినుంచో యెండి రాలిన ఆకులు చీకిరి బాకిరిగా, చెల్లాచెదురుగా - మేటెగా పడివున్నాయి - దానిమీద, ఓ బడుగు, - సొమ్మ సిల్లినట్టు, - అడ్డదిడ్డంగా పడివుంది -

'నువ్వేనా-అవ్వా!-' ఆకూ ఆకూ ఆడినట్లు అడిగాడు-

'ఔఁ! నేనే కొడకా!' మండా - మండా రాపాడినట్టు పలికింది - పెళుక్కున లేచి కూచుంది -

'బువ్వ తిన్నట్టున్నావే!-' నవ్వాడు-

'నేను, పెట్టేదాన్నే కాని, తినేదాన్ని కాను!-పేదరాసి పెద్దమ్మను-' బొమిక-బొమికా కోపంగా ఖంగ్‌మంటూంది - వీడు మాటకు చేయి అడ్డంబెట్టి సముదాయించాడు - 'ఔను లే!'-గాగొంతు తడుముకుంటూ -

పెద్దమ్మ - తనలో తాను మరింత కస్సుమన్నది -

'ఔనేమిటి ? - కాదంటేమాత్రం - నేను నేనే ! - కొమ్ములు తిరిగిన జేజెలందరూ, - రాజు వేషాల్లో ముస్తా బయి- వేటకని అదో వంకబెట్టి - సందె పడగానే నా పంచ చేరేవారు - కాద్దా ? -

'ఒ రేయ్ అబ్బీ! ఏ రాజు కూతురినై నా-కదలేయ్ - ఎవరి చలువో కనుక్కో-'

వీడు యింకా నవ్వాడు -

'అందరూ, - ఆలయంలో కునికితే - నిన్ను నమ్ముకు వచ్చినందుకు - వన్నొక్కడినే ఉసూరు మనిపించావ్ కదా!-'

'ఏమిటే?,–మసకతో పరకాయించింది - వెయ్యేళ్ళనాటి చూపు చూసింది –

'నువ్వా?' వీడు గునిసినట్టు నవ్వాడు –

చితుకులు తునిగినట్టు – ఆ రెండుచేతులూ - వీడి కంఠానికి అడకత్తెర వేసినాయ్ -

'పుట్టని బిడ్డలకు - పేరేం పెట్టుకుందాం – మగడా –

'అందరూ అవ్వా అంటూంటే - నన్ను ఆడదానల్లే ఎందుకు చూశావ్ ! –

'ఔననమని ఎందుకు కవ్వించావ్ -

'నీ పడుచుదనం కేసి పాపమని జాలిపడ్డానే !

'అర్ధరాత్రిదాకా ఉంటే,–ఆ రవంతనవ్వూ నవ్వానో!–'

తీగె అల్లుకున్నట్టు అల్లుకుంది - ఆకూ అలం, నజ్జు నజ్జవుతూ మెటికలు విరిచింది -. వీడు, మర్రాకుమీాది పాప డల్లే - అవ్వ రొమ్మున ఉంగా అన్నట్టు ఉన్నాడు -

దోవతప్పిన పాలికాపు - తనకు ఊపిరి సలుపనట్టు - గుంజి విడదీశాడు - వీడిని బ్రతికించానని, అదిరే కేకవేశాడు-

ఆకడ, గుయ్యారంలో, మనసూ మనసూ కలుపుకుంటూన్న మనిషీ - మనిషీ తప్పు ఒలకబోసుకుంటూ వచ్చి కమ్ముకున్నారు –

'నేను రాకపోతే–పిచ్చిని పీక్కేసి ఉండును!' అన్నాడు ధైర్యంగా, జబ్బ పుష్టిగా, వీడిని చూపిస్తూ –

వీడి – వాలకం, వాళ్ల కళ్ళకు, నిజంగా బ్రతికి బయట పడ్డవాడికిమల్లే ఉంది –

